# విషయసూచిక

# 1. మంత్ర ప్రపంచము - నాలుగు వేదములు



చతుర్వేదాలు భారతీయ సంస్కృతికి పునాదులు అంటే అతిశయోక్తికాదు. ఋగ్వేదం, యజుర్వేదం, సామవేదం, అధర్వణవేదం అని పిలువ బడుతున్న ఈ నాలుగు గ్రంధాలు హైందవ సంస్కృతికి ఆధారం. వివిధ రకాల కర్మ కాండలు, వివిధ దైవ ఆరాధనలు, సాంఘీక నియమాలు, వైద్య రహస్యాలు ఈ వేదాలలో ఉన్నాయి. మంత్ర, తంత్రాలతో కూడిన వామాచారం (చేతబడి) గురించిన వివరాలుకూడా ఈ వేదాలలో ఉన్నాయి. 'వేదం' అంటే జ్ఞానం అని అర్థం.

దైవం తన జ్ఞానాన్ని మానవ భాషలో మానవులకి అందించిన వరము ఈ వేదజ్ఞానము. వేదవ్యాస మహర్షి ఈ వేదాలను నాలుగుగా వర్గీకరించాడు. ఆయన శిష్యులైన 'పైలవైశంపాయనుడు, జైమిని, సుమంతుడు, ఈ వేదాన్ని ప్రజలలో వ్యాప్తిచేసారు. గతంలో ఈ నాలుగు వేదాలలో దాదాపు 1131 విభాగాలు ఉండేవి.

కాలక్రమంలో ఈ విభాగాలు అందకుండాపోయి కేవలం 13 విభాగాలే మిగిలాయి. ఆ 13 విభాగాలలో కేవలం 7 విభాగాలనే నేడు పఠించటం జరుగుచున్నది. వేదాలు లిఖితరూపంలో ఉంచ బడలేదు. గురువు నుండి శిష్యునికి 'వాక్' రూపంలో అందించబడేది. అందువల్ల నాలుగు వేదాలలోని 1131 విభాగాల్ని ఒక్క వ్యక్తే గుర్తుంచుకోవటం అసంభవం అయ్యింది. ఆకారణంగా వేదాలలోని విభాగాలు క్రమంగా ప్రజలకు దూరం అయి కేవలం 7 విభాగాలే అందుబాటులో ఉన్నాయి. ప్రస్తుత నాలుగు వేదాలలో మిగిలిన మంత్రాల మరియు తంత్రాల గురించిన వివరాలను గురించి తెలుసుకొందాం.

**1. ఋగ్వేదం :** వేదాలలో ప్రథమస్థానం ఆక్రమించినది ఋగ్వేదం. ఆ వేదంలో 1028 శ్లోకాలు (సూక్తములు) ఉన్నాయి. ఋగ్వేదం పది మండలాలుగా విభజించబడింది.

రెండవ మండలంలో 43 సూక్తాలు మరియు 429 మంత్రాలున్నాయి.
మూడవ మండలంలో 62 సూక్తాలు మరియు 617 మంత్రాలున్నాయి.
నాల్గవ మండలంలో 58 సూక్తాలు మరియు 589 మంత్రాలున్నాయి.
ఐదవ మండలంలో 87 సూక్తాలు మరియు 727 మంత్రాలున్నాయి.
ఆరవ మండలంలో 75 సూక్తాలు మరియు 765 మంత్రాలున్నాయి.
ఏడవ మండలంలో 104 సూక్తాలు మరియు 841 మంత్రాలున్నాయి.
ఎనిమిదవ మండలంలో 103 సూక్తాలు మరియు 1716 మంత్రాలున్నాయి.
తొమ్మిదవ మండలంలో 114 సూక్తాలు మరియు 1108 మంత్రాలున్నాయి.
పదవ మండలంలో 191 సూక్తాలు మరియు 1754 మంత్రాలున్నాయి.

"వేదాలలో అన్నీఉన్నాయి ష" అని ఒకనాడు 'ఆధునికుల'చే హేళన చేయబడ్డ ఋగ్వేదంపై కొన్ని సంవత్సరాలుగా జరుగుతున్న పరిశోధనా ఫలితాలు ఇటీవలికాలంలో వెలుగు చూసాయి. 'ఋగ్వేదంలో కేవలం మతపరమైన సమాచారమేకాక ఖగోళ శాస్త్రము, గణిత శాస్త్రము మరియు జ్యోతిష శాస్త్రాల గురించిన అపార సమాచారం నిబిడీకృతం అయి ఉన్నది అని ప్రపంచానికి తెలిసింది.

**2. యజుర్వేదం :** నాలుగు వేదాలలో రెండవది యజుర్వేదం. ఈ వేదంలో వివిధరకాల యజ్ఞాలు, ఉత్సవాలు జరుపవలసి నపుడు చదవాల్సిన మంత్రాలు, పాటించాల్సిన విధి, విధానాలు ఉన్నాయి. ఇంకో ఆసక్తికర అంశం ఈ యజుర్వేద విషయంలో ఉన్నది. ఈ యజుర్వేదాన్ని వేద వ్యాసమహర్షి రూపొందించాడు.

కనుక దీనిని కృష్ణప్రకాశ యజుర్వేదం అని పిలుస్తున్నారు. ఈ యజుర్వేదాన్ని దక్షిణ భారతదేశంలోని పండితులు పఠిస్తూ ఉన్నారు. అయితే ఇంకో యజుర్వేదం కూడా ఉన్నదని చాలా కొద్దిమందికే తెలుసు. అదెలాగంటే, ఒకసారి వేదవ్యాసుని శిష్యుడైన యజ్ఞవల్క్యుడు చాలా ఘోరమైన తప్పుచేసాడట. అందుకు కోపించిన వేదవ్యాసుడు, యజ్ఞవల్క్యుడు ఇకపై కృష్ణయజుర్వేదం

చదువరాదని, అట్లుచేస్తే, ఉన్నాది అవ్వాలని శాపం ఇచ్చాడు. యజ్ఞవల్క్యుడు ఖిన్నుడయి, తనకు ఇకపై యజుర్వేదాన్ని పఠించే అవకాశం లేకుండా పోయిందే అని దు:ఖించాడు. అప్పుడు నారదమహర్షి సలహాపై ఆదిత్యుడి గురించి ఘోర తపస్సు చేసాడు యజ్ఞవల్క్యుడు. అతని కఠోర తపస్సుకి సూర్యభగవానుడు ప్రత్యక్షమై అతనికి మరల యజుర్వేదాన్ని బోధించాడు. ఆనాటి నుండి యజ్ఞవల్క్యుడు మళ్ళీ యజుర్వేద బోధన చేయటం ప్రారంభించాడు. అలా సూర్యుని ద్వారా యజ్ఞవల్క్యునికి ప్రసాదింపబడ్డ యజుర్వేదాన్నే శుక్ల ప్రకాశ యజుర్వేదంగా పిలువడింది. ఉత్తర భారత దేశానికి చెందిన పండితులు మాత్రమే ఈ యజుర్వేదాన్ని పఠిస్తారు.

**3. సామవేదం :** ఇక వేదాలలో మూడవది సామవేదం. భగవద్గీతలో శ్రీకృష్ణపరమాత్మ "వేదాలలో నేను సామవేదాన్ని" అని చెప్పారు. 'సామ' అంటే మధురమైన శ్లోకాలు లేదా పాటలు అని అర్థం. సామవేదంలో 13 భాగాలున్నాయి. కానీ ప్రస్తుతం మూడు భాగాలు అనగా రణాయాన, కుధుమ, జైమిని అనే మూడు విభాగాలు మాత్రమే అందుబాటులో ఉన్నాయి. సామవేదంలో 1875 మంత్రాలున్నాయి. ఈ మంత్రాలు, 'పురవాచిక' అనే 650 మంత్రాలు, ఉత్తరాచిక 1225 మంత్రాలు గల రెండు విభాగాలుగా ఉన్నాయి. ఈ వేదాల్ని 'కుధుమశాఖ' అన్న విధానంలో పఠిస్తారు.

**4. అధర్వణవేదం :** ఇక వేదాలలో నాల్గవ వేదం అధర్వణవేదం. మంత్రాలకి, తంత్రాలకి, వైద్యశాస్త్ర రహస్యాలకి నిలయం ఈ వేదం. పూర్వ కాలంలో ఈ వేదాన్ని చదివిన పండితుల్నిచూసి, ప్రజలు భయపడేవాళ్ళు. కారణం ఈ వేదాన్ని చదివిన వాళ్ళు ఏదైనా తంత్రం ప్రయోగించి, తమకు ఆగ్రహం కల్గించిన వాళ్ళకి హానిచేస్తారన్న భయం ప్రజలలో ఆనాడు ఉండేది.

వేదాలను లిఖిత రూపంలో పెట్టకపోవటానికి ప్రధాన కారణం ఏమిటంటే వేదాల్లోని మంత్రాల్ని ఒక్క అక్షరం తప్పుగా వ్రాసినా, ఆ మంత్రాలు ఫలించవు పైగా దోషం అవుతుంది. అందువల్ల 'వాక్' రూపంలోనే గురువు నుండి శిష్యుడికి ఈ వేదాలు అందించబడ్డాయి. వేదాలు చదవటానికి ఒక ప్రత్యేకమైన విధానంఉంది. వేద మంత్రాల్ని వివిధ పద్ధతులలో చదువుతారు. ఒక ప్రత్యేకమైన హెచ్చు, తగ్గుల్ని స్వరంలో ప్రదర్శిస్తూ వేద మంత్రాల్ని పఠిస్తారు. దాదాపు 11

విధాలుగా వేదాల్ని పఠిస్తారు. ఆ విధానాలు ఏవి అంటే 'వాక్య, పఠ, కర్మ, జపమాట, విఖా, రేఖా, ధ్వజ, దండ, రధ మరియు ఘన.

వేదాలను పఠించుటలో 'ఘన' విధానాన్ని పాటించి వేద మంత్రాల్ని పఠించే వారిని 'ఘనాపాఠీలు' అంటారు. ఘన విధానంలో వేద మంత్రాల్ని పఠించేవారు, విభిన్న వరసలో వెనక్కి, ముందుకు మరల ముందుకి, వెనకి చదువుతారు. అలా చదివిన మంత్రాలు, శ్రోతల వీనులకువిందు చేస్తాయి. క్రమం, జట మరియు శిఖా, మాల అనే విధానాలలో వేదాలను చదవటం అధిక సందర్భాలలో జరుగుచున్నది. వేద మంత్రాల్ని చదవటంలో ఎలాంటి తప్పులూ రాకుండా నిరోధించటమే ప్రధాన లక్ష్యంగా వివిధ విధానాలలో, స్వరాలలో వేదాన్ని పఠిస్తున్నారన్నది నిజం. విశ్వంలోని సమస్త జీవుల క్షేమంకోసం ప్రాచీన భారతీయ మహర్షులు అందించే జ్ఞాన భాండాగారాలు ఈ వేదాలు అని తెలుసుకోవాలి.

మంత్రాలకు నిలయం అయిన వేదం అధర్వణ వేదం గురించి క్లుప్తంగా తెలుసుకుంటేగానీ మంత్రాల గురించి ప్రాధమికమైన అవగాహనరాదు. అధర్వణ వేదంలో శత్రువుల ప్రాణాలకి, ఆరోగ్యానికి, పాడి పంటలకు హానికల్గించే మంత్ర విధానాలని, కర్మ కాండని 'అభిచార విధానం' అని పిలుస్తారు. ఈ వేదాన్ని అంగీరసుడు, అధర్వణుడు భృగు మరియు బ్రాహ్మణుడు అనే నలుగురు మహర్షులు రూపొందించారు. ఆయుర్వేద ప్రాధమిక సూత్రాలు అధర్వణవేదంలోనే ఉన్నాయి. యోని (femele's sexual organ) పూజలు జరిపి, శత్రువుల్ని సర్వనాశనంచేసే 'వామాచారం' అధర్వణవేదంలో ఉన్నది. అందువల్లే సనాతన ఆచార పరాయణులైన వేద పండితులు, అధర్వణ పండితుల్ని హీనంగాచూసి, దూరంగా ఉంచేవారు.

'తంత్ర' అనే సంస్కృత పంద యొక్క అర్ధం తరంగం (wave) అని అర్ధం. 'తంత్ర' వేదాంతం ప్రకారం 'శక్తి' (అమ్మవారు)ని ప్రధాన దేవతగా అర్చించబడు చున్నది. 'తంత్ర' విధానాలు హిందూ బౌద్ధ మరియు జైన మతాలలో ఉన్నాయి. వివిధ రకాల తంత్ర విధానాలు ఇండియా, నేపాల్, చైనా, జపాన్, టిబెట్, కొరియా, కాంబోడియా, బర్మా, ఇండోనేషియా మరియు మంగోలియా దేశాలలో వాడుకలో ఉన్నాయి. తంత్ర విధానాల్ని ఈనాటికీ అంటరాని విభాగంగా హైందవ ప్రజలు భావిస్తున్నారు. తంత్ర విధానాలలో

శివుడిని, శక్తిని పూజిస్తారు. నరబలితో సహా అనేక రకాల జంతు బలులు ఈ తంత్ర విధానంలో ఉన్నాయి. ఈ తంత్రాలలో మూడు రకాలున్నాయి. అవి దక్షిణం అనగా సత్వగుణ ప్రధానం అయిన తంత్ర విధానం, 'మధ్యమ' విధానం అనగా రాజస గుణ ప్రధానం అయినది, ఇక చివరిది వామ విధానం ఇది తామస గుణ ప్రధానం అయినది.

శ్రీమద్ భగవద్గీతలోని 17వ అధ్యాయము అయిన శ్రద్ధాత్రయ విభాగ యోగంలో అర్జునునిలో శ్రీకృష్ణ పరమాత్మ ఇట్లు పలికెను సాత్వికులు దేవతలను, రాజసులు యక్ష, రాక్షసులను, తామసులు ప్రేత, భూత గణములను పూజించెదరు. కనుక మానవులు తమ గతజన్మ వాసనలవల్ల తాము పూజించ వలసిన వారిని నిర్ణయించుకొంటారు. ఏది ఏమైనా తంత్ర విధానంలోని వామాచార విధానం భూత, ప్రేతాన్ని, క్షుద్ర దేవతల్ని ప్రసన్నంచేసుకుని, ఆశించినవి పొందటానికి ఉప యోగపడుతున్న మాట నిజం.

## 2. ఈజిప్టు మంత్రశాస్త్ర గ్రంథం : Book of the dead (మృతుల గ్రంధము) వివరాలు ఏమిటి?

ఈనాడు ముస్లిం దేశంగా చెలామణీ అవుతున్న ఈజిప్టు ఒకనాడు బహు దేవతారాధనలు చేసే ప్రజలున్న దేశంగా ఉండేది. ముఖ్యంగా ప్రాచీనకాలంలో ఈజిప్టుని పాలించే రాజులు (ఫారోలు) అటు రాజ్యాన్ని కూడా ఇటు మతాన్ని శాశించేవారు. ఈజిప్టు ప్రజలకు చావు, పుట్టుకల గురించి అనేక విశ్వాసాలు ఉండేవి. మరణించిన మానవుల దేహాల్ని మమ్మీలుగా మార్చి 'పిరమిడ్ల' లో సమాధిచేసేవారు. అయితే చనిపోయిన వారిని మరల బ్రతికించే మంత్రాలు కూడా వారికి తెలుసు, అలాంటి మంత్రాలున్న ఒక మహా గ్రంథం పేరు 'మృతుల గ్రంధం' (బుక్ ఆఫ్‌ది డెడ్) సమాధులలో ఉండే మృత దేహాల దగ్గర పడిఉన్న వివిధ పురాతన గ్రంథ భాగాల్ని సేకరించి, సంస్కరించి కార్లే రీచర్డ్ అనే ఈజిప్టాలజిస్ట్ (అనగా ఈజిప్టు ప్రాచీన అంశాలపై పరిశోధనచేసేవాడు) 1842లో 'బుక్ ఆఫ్ ది డెడ్' గ్రంధాన్ని ప్రచురించాడు.

ఈ మృతుల గ్రంథంలో అనేక మంత్రాలు, తంత్రాలు, మార్మిక శక్తుల్ని వశంచేసుకునే విధానాల గురించి వివరించబడింది. మరణించిన వారి ఆత్మలకు సుఖాన్ని కల్గించటమే ఈమంత్ర గ్రంథంయొక్క ప్రధాన లక్ష్యంగా ఉండేది. ఈజిప్టువారి పురాణాల ప్రకారం మనిషి మరణించిన తర్వాత టోత్ (Thoth) అనే దైవం, మరణించిన వ్యక్తి యొక్క గుండెని తీసి తూకం వేస్తుంది. మృతుడి గుండె ఒక పక్షి ఈక కన్నా తక్కువ బరువు తూడితే, అతడ్ని స్వర్గానికి పంపుతాడు ఆ దైవం. చనిపోయినవాడి గుండె బరువుగా ఉంటే, అతడు పాపి అని దైవం నిర్ణయిస్తాడు. అప్పుడు దైవంకి కొద్దిదూరంలో నిల్చున్న 'అమ్మిట్' అనే మహాభూతం, బరువైన గుండె కలిగిన వ్యక్తిని (పాపి) తినేస్తుంది. అంటే ప్రాచీన ఈజిప్టు ప్రజల మత విశ్వాసాల ప్రకారం పాపుల్ని భూతం తినివేస్తుంది అనీ, పుణ్యాత్ముల్ని స్వర్గానికి పంపటం జరుగుతుందని తెలుస్తున్నది కదా!

మృతుల గ్రంధం అంటే కేవలం ఒకే ఒక్క గ్రంధం కాదు అనేక గ్రంధాలు, విభిన్న కాలాలలో వ్రాయబడ్డ గ్రంధాలు కలిసి ఈ 'మృతుల గ్రంధం' తయారయ్యింది. నేటికి 3,600 సంవత్సరాల క్రితం మృతుల గ్రంధం తయారయింది. 'మమ్మీ' (మూలికల ద్రవంలో ముంచిన బాండేజ్ గుడ్డలాంటి దానిని మృతదేహాన్ని చిరకాలం భద్ర పరచటానికి, మృతదేహంచుట్టూ చుట్టేవారు. అలా గుడ్డచే చుట్టబడిన మృతదేహాన్ని మమ్మీ అంటారు). ఆ మృతదేహంపై ఉన్న గుడ్డమీద ఆ మృతదేహం తాలూకు వ్యక్తి యొక్క పాప, పుణ్యాల గురించిన వివరాలు వ్రాసి, దైవ విచారణ ఆ వ్యక్తిపట్ల ఎలా ఉంటుందో వివరించే బొమ్మలు కూడావేసి ఉంచారు). అలాంటి వివిధ మమ్మీలపైన ఉన్న వివరాలతో తయారైన గ్రంధాల మొత్తమే 'మృతుల గ్రంధం'. (Book of the dead)

ఈజిప్టు మత విశ్వాసాల ప్రకారం 'అనుబిస్' అనే దైవం మరణించిన వారి గుండెల్ని తూకంవేసి, వారి గుండెలు తేలికగా ఉన్నచో, వారు పుణ్యాత్ములని తేల్చి స్వర్గానికి పంపుతాడు. మరణించిన వారి గుండె బరువుగా తూడితే వారు పాపులని దైవ నిర్ణయిస్తాడు. అప్పుడు వాళ్ళు నరకానికి (under world) పంపబడతారు. దైవం పాపాత్ముల మరియు పుణ్యాత్ముల వివరాలు చెపుతుండగా టోల్ అనే రాక్షసుడు, ఆ వివరాలను ఒక పుస్తకంలో వ్రాస్తూ ఉంటాడు.

"పాపిరస్ ఆఫ్ అని" అనే గ్రంథంలో 'అని' అని పిలువబడే ఒక వృద్ధురాలు చనిపోయిన తర్వాత దైవం వద్ద ఎలా విచారించబడిందో వ్రాయబడింది. ఈ

పుస్తకంలో దైవం, 'అనీ' ని విచారిస్తున్న సందర్భాన్ని విశదీకరించే చిత్రాలు (figures) కూడా చిత్రించబడ్డాయి.

దైవం ఆమె హృదయాన్ని పక్షి రెక్కతో తూచాడు. ఆమె గుండె ఆ రెక్క కన్నా తక్కువ బరువు తూగింది. దాంతో ఆమె పుణ్యాత్ములు అని దైవం నిర్ణయించాడు. ఆమె స్వర్గానికి పంపబడుతుంది.

# 3. మహమ్మదీయ మతంలో మంత్రాలు, జ్యోతిష్యము ఉన్నాయా?

చాలామంది ముస్లింలకు తమ పవిత్ర గ్రంధం అయిన ఖురాన్‌లో జ్యోతిష శాస్త్రం గురించి వ్రాయబడి ఉన్నదని తెలీదు. కనుకనే వారు జ్యోతిషం చెప్పించుకోవటం తప్పనుకుంటున్నారు. ఆ వివరాలను పరిశీలించండి.

ఖురాన్ గ్రంథంలో ఉన్న 85వ సురా బరజ్ గురించి పరిశీలిస్తే, అసలు బరజ్ (Buruj) అనే అరబ్బీ పదం యొక్క అర్థం రాశి చిహ్నం (Zodiac) అని గ్రహించాలి. ఆ 'సురా' ఇలా ప్రారంభం అవుతుంది. రాశి చిహ్నాలపై ప్రయాణం చేసి చెపుతున్నాను (అల్లా ఆకాశంలో ఉన్న రాసులపై ప్రయాణంచేసి మానవులకి చెపుతున్నారు).

సురాహిజ్రి అనే సురాలో 16వ లైను ఇలా ఉన్నది. "రాశి చక్రాన్ని నా ప్రజలు చూడటానికి ఆకాశంలో సృష్టించాను. దుష్ట శక్తుల బారినుండి ఆరాశి చక్రాన్ని రక్షిస్తాను. (తానే రాశి చక్రాన్ని సృష్టించానని అల్లా ఈ సురాలో చెప్పారు)".

'బురజ్' అంటే అరబ్బీ భాషలో రాసిచక్రం అన్న అర్థం కూడాఉన్నది. అరబ్బీ వారి జ్యోతిషంలో సింహరాశిని (Leo) ని అసద్‌బురజ్ అంటారు. 'అసద్' అంటే అరబ్బీ భాషలో సింహం అని అర్థం. అరబ్బీలో తులారాశి (Libra) ని మీజన్ బురజ్ అంటారు. అరబ్బీ భాషలో 'మీజన్' అంటే త్రాసు అని అర్థం.

మూసా ప్రవక్త (అ) గురించి తెలియని ముస్లిం అంటూ ఉండదు. ఆయన పుట్టటానికి చాలా సంవత్సరాలముందే ఫారోన్ రాజు, (ఈజిప్టు)

తాను దేముడిని అని ప్రకటించుకున్నాడు. ఒకరోజు ఆ రాజుగారి జ్యోతిష్కుడు, రాజుగారిని కలిసి ఇలా అన్నాడు 'ఓ సుల్తాన్ మిమ్మల్ని సంహరించే దైవం యొక్క బిడ్డ త్వరలో జన్మించనున్నాడు. అతడు పెద్దవాడు అయి మిమ్మల్ని చంపుతాడు. ఆ రాజుగారికి తెలుసు, తన జ్యోతిష్కుడు చెప్పింది అక్షరాల నిజం అవుతుంది అని. దాంతో ఆయన తన వజీర్‌ని పిలిచి తన రాజ్యంలో పుట్టే మగపిల్లల్ని చంపివేయమని ఆజ్ఞాపించాడు. అలా సుల్తాన్ ఆజ్ఞాపించటం వల్ల ఆ రాజ్యంలోని వేలాది పిల్లలు సంహరించబడ్డారు. కానీ రాజుగారి గూఢచారుల కంట బడపడకుండా మూసాప్రవక్త జన్మించటం, పెరిగి పెద్దవాడయి, సుల్తాన్‌గారిని సర్వనాశనం చేయటం జరిగింది.

మొగల్ చక్రవర్తి అక్బర్ తండ్రి అయిన 'హుమాయాన్ గొప్ప జ్యోతిష శాస్త్రవేత్త. ఒమర్‌ఖయ్యాం గురించి తెలియని గజల్‌గీత ప్రేమికుడు ఉండడు. ఈయన క్రీ.శ. 1019-1135 ఖారస్యా ప్రాంతంలో జీవించాడు. ఈయనకి జ్యోతిషశాస్త్రంలో గొప్ప పాండిత్యం ఉన్నది. తను ఎప్పుడు చనిపోతాడో ముందుగానే చెప్పాడు ఈ 'రుబాయత్' (గజల్సు) ల రచయిత.

చేతబడులు, నరదృష్టి సోకటంలాంటి జరిగినపుడు పవిత్ర ఖురాన్‌లో ఉన్న 'జంజిల్' అనే శ్లోకాల సముదాయాన్ని పఠిస్తూ ఒక గ్లాసు నీటిని తీసుకుని, ఆ నీటిలో వ్రేళ్ళుముంచి, ఇంటి గోడలపైనా, ఇంట్లోని వస్తువులపైనా చల్లితే దుష్టశక్తుల ప్రభావం నశించిపోతుంది అని ముస్లింలు భావిస్తారు.

కొందరు ముస్లింలు 'అల్లా' జ్యోతిషాన్ని నిషేధించాడని, భవిష్యత్‌ని జ్యోతిష్కుల ద్వారా తెలుసుకోవటం మహాపాపం అని చెపుతూ ఉంటారు. అది నిజంకాదు. జ్యోతిషం ఖురాన్‌కి విరుద్ధంకాదు అని నిరూపించే కొన్ని ఉదాహరణలు పరిశీలిద్దాం.

జ్యోతిషం ఒక సైన్స్ అది హిందూ మతానికిసొంతంకాదు. దాన్ని 'అల్లా' నిషేధించారు అనటానికి ఏ ఆధారాలు లేవు. ముస్లింమతం జ్యోతిషాన్ని నిజంగా నిషేధించాల్సి వస్తే ముస్లిం దేశమైన ఈజిప్టులో ఉన్న జ్యోతిషాన్ని కూడా నిషేధించాలి. మనిషి తాను చేసిన క్రియల ఫలితాన్ని అనుభవిస్తాడు.

గతజన్మలోని కర్మల ఫలితాలు ఈ జన్మలో అనుభవించాలి. రేపు ఏం జరగబోతున్నది అన్నది తెలుసుకోవటానికి ఉపయోగపడేదే జ్యోతిషం. హజ్రత్ మహ్మద్ (స) అందుకే ఇలా అన్నారు. ప్రతివాడు తాను చేసినదే పొందితీరతాడు. ఇస్లాం అంటే 'శాంతి' అని అర్థం. 'ముస్లిం' అంటే శాంతికి అధీనుడు అయినవాడని అర్థం. చేతబడులకు, గాలి చేష్టలకు (దయ్యం ఆవహించటం) ముస్లింలు పాటించే రక్షక విధానాలు క్రింది విధంగా ఉంటాయి.

1. గ్లాసు నీరు తీసుకోవాలి.
2. 11 సార్లు దారూన్‌షరీఫ్ పఠించాలి.
3. 487 సార్లు "బిస్మిల్లా ఇర్‌రహ్మాన్ నిర్ రహీమ" పఠించాలి.
4. మరల 11 సార్లు దారూద్ షరీఫ్ పఠించాలి.
5. గ్లాసులోని నీటిని మూడుసార్లు నోటితో ఊదాలి.
6. మంత్రించిన జలాన్ని బాధితుడికి ఇవ్వాలి.

అంతే గాలిచేష్టలు నివారించబడి, బాధితుడు తేలిక అవుతాడు. ముస్లింలు చేతబడుల్ని నమ్ముతారు. కానీ నిజమైన ముస్లింలు అట్టి ప్రయోగాల్ని చేయరు మరియు చేయించరు. మహమ్మద్ ప్రవక్త (స) వారంలోని ఏడురోజుల్లో, ఏరోజు ఏపని చెయ్యాలో వివరించారు. అంటే ఆయన పరోక్షంగా జ్యోతిషాన్ని బలపరిచినట్లేకదా! ప్రవక్త చెప్పిన కార్యాల, మరియు వారాల గురించి తెలుసుకొందాం.

1. శనివారం – వేటకు వెళ్ళాలి
2. ఆదివారం – గృహ నిర్మాణం ప్రారంభం చెయ్యాలి.
3. సోమవారం – ఎట్టైనా ప్రయాణం ప్రారంభించవచ్చు
4. మంగళవారం – క్షుర కర్మ చేయించుకోవాలి.
5. బుధవారం – ఔషధాలు తీసుకోవటం ప్రారంభించాలి.
6. గురువారం – ప్రార్థనలు, పూజలు ప్రారంభించాలి.
7. శుక్రవారం – వివాహం,శృంగారాల అనుకూలం.

ఇస్లాంలో చెప్పబడ్డ పై వారాలు, ఆవారాలలో ప్రారంభించాల్సిన కార్యాలను చూసాం కదా, ఇప్పుడు భారతీయ జ్యోతిషశాస్త్రం చెప్పిన గ్రహ లక్షణాలను పరిశీలిద్దాం.

1. శని (శనివారం) – మృతి మరియు క్రూరత్వం.
2. సూర్యుడు (ఆదివారం) – కీర్తి, స్థాపించేశక్తి
3. చంద్రుడు (సోమవారం) – ప్రయాణాలు
4. కుజుడు (మంగళవారం) – జుట్టుకి అధిపతి కుజుడు
5. బుధుడు (బుధవారం) – రసాయనిక శాస్త్రం, వైద్యం, సైన్స్
6. గురువు (గురువారం) – మతం, మతపర కార్యాలు
7. శుక్రుడు (శుక్రవారం) – వివాహం, శృంగారానికి కారకుడు శుక్రుడు.

ఇస్లాంమతంలోనివారు ఏ రోజు, ఏ పనిచేయాలో ప్రవక్త చెప్పారు. భారతీయ జ్యోతిషం ఏ గ్రహం, ఏ అంశాల్ని పాలిస్తుందో వివరిస్తుంది. అంటే ముస్లిం మతంలో జ్యోతిషానికి స్థానం ఉన్నదని అర్థం అవుతున్నది కదా!, రత్నాల వాడకం వల్ల గ్రహ దోషాలు పోయి మేలు జరుగుతుందని జ్యోతిషం చెపుతుంది. ఇస్లాంకూడా రత్నధారణని అంగీకరించింది.

# 4. జపాన్‌లోకూడా మంత్ర విధానాలు ఉన్నాయా?

సాంకేతికంగా ఎంతో అభివృద్ధిచెంది, రెండవ ప్రపంచయుద్ధంలో చావు దెబ్బతినికూడా, మళ్ళీశ్రమించి, తనపై అణుబాంబులు వేసిన అమెరికాను సవాల్‌చేసే స్థితికి ఎదిగిన జపాన్‌లోకూడా మంత్రాలు, తంత్రాల్ని నమ్ముతారు అంటే ఆశ్చర్యంగా అనిపించినా ఇదిమాత్రం నిజం. జపాన్‌లో మంత్రాల పట్ల విశ్వాసం కల్గించింది భారతదేశంనుండి జపాన్‌కి వ్యాపించిన మహాయాన బౌద్ధమతమే అని తెలుస్తున్నది. భారతదేశంలో ఏర్పడ్డ మహాయాన బౌద్ధ ముందు కొరియాకు వ్యాపించింది. క్రీ.శ. 552లో కొరియా రాజు అయిన 'సిరమాయ' కొందరు బౌద్ధ భిక్షువుల్ని మత ప్రచారానికి జపాన్ పంపాడు. నాటి జపాన్ చక్రవర్తి 'కిమాయ్' తన దేశంలో మహాయాన బౌద్ధమత ప్రచారం జరగటానికి

చాలా సహకరించాడు. జపాన్‌లో బుద్ధుడి తొలి ఆలయం ఒక పూరిపాకలో ఏర్పాటుచేయబడింది. క్రమంగా బౌద్ధ బిక్షుకు రాళ్ళుసైతం జపాన్ వెళ్ళి బౌద్ధమతాన్ని అక్కడ ప్రచారంచేసారు. 7వ శతాబ్దంలో జపాన్‌ని పాలించిన 'సోటోకు' చక్రవర్తి జపాన్‌లో బౌద్ధమతం విస్తరించటానికితన యధాశక్తీ కృషిచేసాడు.

జపాన్‌లో ఏర్పడి ప్రపంచం అంతటా పేరుపొందిన ఒక బౌద్ధమత శాఖా జెన్‌బుద్ధిజం. (Zen) జెన్ అంటే జపాన్ భాషలో ధ్యానం (Meditation) అని అర్థం. క్రీ.శ. 749లో నాటి జపాన్ రాజధాని అయిన 'నారా' నగరంలో తొలిసారిగా అతిపెద్ద ఇత్తడి బుద్ధుడి విగ్రహం స్థాపించబడింది. క్రీ.శ. 18వ శతాబ్దం ప్రవేశించే సరికి 'నారా' నగరం మహాయాన బౌద్ధమతానికి ఆయువుపట్టుగా మారింది. ప్రస్తుతం జపాన్‌లో 13 వర్గాలుగా మహాయాన బౌద్ధం చీలిపోయి ఉన్నది. ఈ13 వర్గాలలో 5 వర్గాలు (sects) ప్రముఖ స్థానంలో ఉన్నాయి. అని తెండాయ్, షిన్‌గాన్, బెన్‌పర్లాండ్, నికిరీన్ మరియు జోడో. ఈ ఐదు వర్గాల్లో ప్రధమస్థానంలో ఉన్నది జెన్ బుద్ధిజంశాఖ. 'జెన్' శాఖా బోధనల ప్రకారం దైవం, మనిషి, విశ్వం అన్నీ ఒకటే అన్న అద్వైత సిద్ధాంతం ప్రకటింతం అవుతుంది.



**అదృష్టాన్ని ఇచ్చే సప్తదేవతలు**

బుద్ధుడిని దైవంగా కొలిచే జపాన్‌లో మతవిశ్వాసాలు అధికంగా ఉన్నాయి. కోరికలు తీరకుండా మరణించే మానవులు దయ్యాలుఅయి మనుషుల్ని పీడిస్తారనీ, పునర్జన్మ ఉందనీ, స్వర్గం, నరకం ఉన్నాయనీ, అదృష్టం, దురదృష్టం ఉన్నాయనీ, క్షుద్ర శక్తులు, చేతబడులు ఉన్నాయనీ జపాన్‌లో అధికశాతం ప్రజలు నమ్ముతారు.

జపాన్ ప్రజలు తమకు అదృష్టాన్ని ఇచ్చే ఏడుగురు దేవతల బొమ్మల్ని ఇంట్లో ఉంచుకుంటారు. 'లాఫింగ్ బుద్ధ' అనే బొజ్జ మనిషి అందరికీ తెలిసినదే. చాలామంది అనుకుంటున్నట్టుగా ఈ ఊబకాయం బొమ్మపేరు బుద్ధకాదు హొటేయ (Hotei) అని తెలుసుకోవాలి. అంతేకాదు ఈ హొటేయ జపాన్ దైవంకాదు,చైనా దేముడు. ఇండియాలో పుట్టి, జపాన్‌కి వ్యాపించిన మహాయానం హిందూ దేవుళ్ళపేర్లు మార్చి జపాన్‌కి రవాణాచేసింది. ఆ దేముళ్ళనే అదృష్టాన్ని, విజయాన్ని ఇచ్చే "సెవెన్ లక్కీగాడ్స్"గా జపాన్ ప్రజలు కొలుస్తున్నారు.

# 5. కాలముఖులు అనే తాంత్రికుల వివరాలు ఏమిటి?

'కాలముఖులు' అన్న సంస్కృత పదం యొక్క అర్థం 'నల్లని ముఖాలుగల వారని అర్థం. ఈ వర్గంవారు ముఖానికి బూడిదపూసుకొని నల్లగా కనిపిస్తారు. క్రీ.శ. 13వ శతాబ్దం దాకా కర్నాటక ప్రాంతంలో ప్రముఖ తాంత్రిక వర్గంగా 'కాలముఖులు' చెలామణి అయ్యింది. ఇదే ప్రాంతంలో, 8వ శతాబ్దం ప్రాంతంలోనే కాలముఖులు ఉన్నట్టుగా ఇటీవలి కాలంలో దొరికిన శిలాశాసనాల ద్వారా తెలుస్తున్నది. ఈ కాలముఖ తాంత్రిక వర్గంలో రెండు ఉపవర్గాలున్నాయి. అందులో ఒకటి 'శక్తిపరిషత్'. ఈ వర్గం వారు కర్నాటకలో ఉన్న ధార్వాడ్ మరియు షిమోగా జిల్లాల్లో ఉండేది. ఇంకొక వర్గంపేరు 'సింహ పరిషత్' ఈ వర్గానికి చెందిన మంత్రవాదులు మైసూర్ నుండి ఆంధ్రప్రదేశ్ సరిహద్దులదాకా విస్తరించి ఉండేవారు. ఈ రెండు వర్గాలలో శక్తి పరిషత్ వర్గం రాజుల ఆదరణపొంది ప్రముఖంగా వెలుగొందింది.


కాలముఖ యోగి

ఈ నాటికీ బెలగేవ 'ప్రాంతంలో ఉన్న శక్తిపరిషత్‌కి చెందిన 'కేదారేశ్వర' ఆలయం నిలిచి ఉన్నది. ఈ ఆలయాన్ని నేడు ప్రాచీన కాలానికి చెందిన

అరుదైన పురావస్తు కట్టడంగా భావించి సంరక్షించబడుచున్నది. ఇక రెండవ వర్గమైన సింహపరిషద్‌కి అటు ప్రజల నుండి, ఇటు రాజుల నుండీ సరి అయిన ఆదరణలేక కాలక్రమంలో అంతరించిపోయింది.

'కాలముఖులు' ఆలయాలకి దగ్గరలో తమ మఠాలను స్థాపించుకొని నివశించేవారు. కాలముఖులకు కన్నడ రాజులు భూములు, బంగారం దానాలుగా ఇచ్చినట్టుగా శిలాశాసనాలు ఉన్నాయి. ఈ ఆదాయాల ద్వారా తమ మఠాలకు దగ్గరగా ఉన్నఆలయాల నిర్వహణ కాలముఖులు చేపట్టేవారు. అంటే ఆధునిక కాలంలో శృంగేరి పీఠానికి గుళ్ళు అప్పగిస్తున్నట్టుగా నాడు కాలముఖులకి ఆలయాలు అప్పగించబడేవన్నమాట. 'కాలముఖులు' నిర్వహించే ఆలయాలలో దేవదాశీ వ్యవస్థ అమలులో ఉండేది. దేముడి ఉత్సవాల సమయంలో ఆడి,పాడి భక్తుల్ని, భగవంతుడిని ఆనందపరిచే అవివాహిత స్త్రీలను దేవదాసీలు అంటారు. ఇది ఒక వ్యవస్థగా మారి ఆలయాలలో వ్యభిచారం అధికం అయ్యింది. ఆనాడు ఈ ఆలయాల్ని అజమాయిషి చేస్తున్న కొందరు కాలముఖులు క్రమంగా తమని బ్రాహ్మణులుగా జనాలకి చెప్పుకోసాగారు. శైవ సంప్రదాయానికి చెందిన ఒక సంప్రదాయం ఈ కాలముఖులు పాటిస్తారు.

శైవ సాంప్రదాయ వర్గాలలో ఒకటిఐన 'పాశుపత' విభాగంతో కాలముఖులకు భావ స్వరూప్యం ఉన్నది. పాశుపత విభాగానికి గురువు అని చెప్పదగిన 'లకువికుడు' అనే యోగి 'పాశుపత సూత్రములు' అనే గ్రంధాన్ని వ్రాసాడు. అనేకమంది కాలముఖ యోగులు కువికుడి అవతారంగా చెప్పబడ్డారు. పతంజలి యోగా సూత్రాల ప్రకారం యోగా చేసిన వారికి అతీంద్రియ శక్తులు వస్తాయని కాలముఖులు పేర్కొన్నారు. కాలముఖులు లింగారాధకులుగా ఉండేవారు. శివుడిని లింగరూపంలో ఆరాధించటమే వీరిలక్ష్యం. 12వ శతాబ్దం నాటికి కాలముఖ వర్గం అదృశ్యం అవటం, లింగాయతులు (లింగాల్ని మెడలో ధరిస్తారు) అనే వీర శైవ వర్గం కర్నాటక ప్రాంతంలో ప్రాబల్యం సంపాదించసాగింది. వీర శైవ ఉద్యమానికి ఆద్యుడు బసవేశ్వరుడు. ఇతడు కాలముఖ సిద్ధాంతాలలో ఉన్న లోపాలను సరిదిద్ది వీరశైవాన్ని వ్యాపింప చేసాడు. అప్పటిదాకా కాలముఖులచే నిర్వహించబడుచున్న శివాలయాల అజమాయిషీ క్రమంగా వీరశైవుల ఆధ్వర్యంలోకి రాసాగాయి.

కపాలికుల్ని, కాలముఖుల్ని జతచేసి కొన్ని గ్రంధాలలో వ్రాయబడినప్పటికినీ, కపాలికులుచేసే జుగుప్సాకర తాంత్రిక పూజలు, బలులు ఇవ్వటం కాలముఖులు చెయ్యరు. కనుక కాలముఖులు పూర్తిగా నాగరికమైన శైవ తాంత్రి విధానం అని గుర్తించాలి.

# 6. గోరఖ్‌నాథ్ స్థాపించిన తాంత్రిక - నాథ సాంప్రదాయ వివరాలు ఏమిటి?

ఉత్తరభారతదేశంలోనూ మరియు టిబెట్, పాకిస్తాన్, శ్రీలంక లాంటి ప్రాంతాలలో ఈ నాథ తాంత్రిక సాంప్రదాయం ఈనాటికీ నిలిచి ఉన్నది. సంస్కృతభాషలో నాథఅంటే ప్రభువు,రక్షకుడు లేదా శరణు ఇచ్చేవాడు అని అర్థం. అనగా నాథ అన్న శబ్దము పరమశివుడిని సూచిస్తుందని, ఈ సాంప్రదాయాలు పాటించే సిద్ధులు భావించటం జరుగుతున్నది. ఈ సిద్ధ సాంప్రదాయాన్ని ఆదినాధుడు (పరమశివుడు) స్థాపించినట్టుగా తెలుస్తున్నది. ఆ తరువాతకాలంలో మత్స్యేంద్రనాథ్, గోరఖ్‌నాథ్, విరూపాక్షనాథ్, ఖేచర్‌నాథ్ లాంటి సిద్ధయోగులు ఈ సంప్రదాయాన్ని ప్రజలలో ప్రచారం చేయటం జరిగింది. ఈ నాథసాంప్రదాయాన్ని శివుడు స్థాపించినప్పటికీ క్రీ.శ. 8వ శతాబ్దంలో జీవించిన మత్స్యేంద్రనాధుడు ఈ సాంప్రదాయాన్ని బాగా అభివృద్ధిచేసినట్టుగా తెలుస్తోంది.

ఈ మత్స్యేంద్రనాధుడి జన్మవృత్తాంతం గురించి విభిన్నమైన కధనాలు వినిపిస్తూ ఉంటాయి. అందులో ఒక కధనం ప్రకారం మత్స్యేంద్రనాధుడు ఒక సామాన్య బెస్తవాడని, శివునియొక్క బోధనల వల్ల యోగిగా మారాడని తెలుస్తున్నది. ఇంకొక కధనం ప్రకారం ఒకప్పుడు పిల్లవాడుగా ఉన్న మత్స్యేంద్రనాధుడుని ఒకచేప మింగిందని, ఆ చేప శివపార్వతులు ఒక మహాసముద్రం మధ్యభాగంలో నీటి అడుగున కూర్చుని మాట్లాడుకుంటూ ఉండగా అక్కడికి వెళ్ళిందనీ సరిగ్గా అదే సమయానికి శివుడు కొన్ని యోగ రహస్యాలను పార్వతీదేవికి తెలియజేసాడనీ, శివుడు చెప్పిన రహస్యాలను చేప కడుపులో ఉన్న మత్స్యేంద్రనాధుడు విన్నాడనీ ఆ తరువాత ఆచేప నీటిపైకి వెళ్ళినపుడు ఒక బెస్తవాడు ఆ చేపను పట్టుకొని ఇంటికి తీసుకువెళ్ళి, దాన్ని

మధ్యగా కోసినపుడు ఆ చేపలోనుండి మత్యేంద్ర నాధుడు బయటపడి ఆ జాలరిని సంభ్రమాశ్చర్యాలలో ముంచాడని తెలుస్తున్నది. ఆ తరువాత కొంతకాలానికి మత్యేంద్రనాధుడు సన్యాసం స్వీకరించి శివుడు స్వయంగా చేసిన బోధనల ప్రకారం నాధ సాంప్రదాయాన్ని స్థాపించాడు.


మత్యేంద్రనాధుడు

ఇంకొక కధనం ప్రకారం శివుడే స్వయంగా పంచభూతాల అంశలను తీసుకొని ఆ అంశలను ఒకటిగాచేసి మత్యేంద్రనాధుడుని సృష్టించాడని తెలుస్తున్నది. అనగా మత్యేంద్రనాధుడు ఏ స్త్రీయొక్క ఉదరమునుండి బయట రాలేదని అనగా అయోనిజుడని గుర్తించాలి. అంతేకాకుండా పంచభూతాలకు నాశనం లేదుకనుక ఈ మత్యేంద్రనాధుడు కూడా చిరకాలం చిరంజీవిగా ఉంటాడని తెలుస్తున్నది. మత్యేంద్రనాధుడు జన్మించిన 300 సంవత్సరాలకు అనగా 11వ శతాబ్దంలో గోరఖ్‌నాధుడు అనే యోగి మత్యేంద్రనాధుని నుండి నాధసాంప్రదాయాన్ని స్వీకరించటం జరిగింది. ఈ గోరఖ్‌నాధుడు 100 సంవత్సరాలపాటు జీవించాడు. గోరఖ్‌నాథ్ కాలంలో నాధసాంప్రదాయం చాలా అభివృద్ధి చెందింది. ఈయనే హఠ యోగానికి ఆద్యుడు అని తెలుస్తున్నది. ఈ గోరఖ్‌నాధుని నేపాల్‌లోకూడా పూజించటం జరుగుతుంది. ఆయనమీద ఉన్న గౌరవం కారణంగానే నేపాల్‌లోని ఒకజాతి వారు తమ జాతికి "గూర్ఖా" అనేపేరును పెట్టుకున్నారు. ఈ గూర్ఖాజాతివారే భారతదేశంలో రాత్రి సమయాలలో వీధులలో గస్తీ తిరగటం, ఇళ్ళకు కాపలా కాయటం లాంటి పనులు చేస్తున్నారు. అంతేకాకుండా గోరఖ్‌పూర్ అనేజిల్లా ఈ గోరఖ్‌నాధుని పేరునుండే వచ్చింది. భారతదేశంలో యోగ సంబంధ తాంత్రిక విధానానికి గోరఖ్‌నాధుడు ఎంతో సేవచేసాడు.

# 7. అష్టసిద్ధులు అంటే ఏమిటి?

'సిద్ధి' అన్న సంస్కృత పదానికి అర్థాలు మూడు ఉన్నాయి. అవి (1) ఖచ్చితత్వం (2) సాధించటం (3) విజయం. ఆధ్యాత్మికశక్తితో అతీంద్రియ శక్తుల్ని సాధించటమే సిద్ధి. హిందూ మరియు బౌద్ధ మతాలలో కూడా సిద్ధి అంటే లోపాలు లేని ఒక స్థితి అని భావిస్తారు. ఈ సిద్ధుల్ని సాధించినవారు ఒకే సమయంలో అనేకచోట్ల ఉండగలరు. ఇక్కడ ఉండి ఎక్కడో జరుగుతున్నది తెలుసుకోగలిగే దివ్యదృష్టి వారి కుంటుంది. ఇతరుల గతజన్మల గురించి కూడా వీరు ఇట్టే చెప్పగలరు. సాధకుడు సిద్ధిని ఎందుకు పొందుతాడు? కేవలం దైవం గురించి సంపూర్తిగా తెలుసుకోవటం కోసం సిద్ధుల్ని సాధిస్తారు సాధకులు.

హైందవ పురాణాల్లో తొమ్మిది రకాల సిద్ధులు ఉన్నాయని చెప్పబడింది. అవి క్రింద పేర్కొనబడిన విధంగా ఉన్నాయి.

1. పరకాయప్రవేశం 2. హాది విద్య
3. కాది విద్య 4. వాయుగమన సిద్ధి
5. మదాస విద్య 6. కనధారా సిద్ధి
7. ప్రక్యసాధన 8. సూర్యవిజ్ఞానం 9. మృత సంజీవనీ విద్య



**ఫోటో : గణపతి మరియు అష్టసిద్ధులు (అష్టసిద్ధులు గణపతికి సేవకులు)**

ఇందులో మొదటిది అయిన పరకాయ ప్రవేశ విద్యలో ఒక చనిపోయిన మానవుని లేదా జీవి శరీరంలో సిద్ధుడి ఆత్మ ప్రవేశించి చనిపోయిన దేహాలు లేచి కదిలేలా పనులు చేసేలా చేయవచ్చు.

ఇక 'హాదివిద్య' సాధించినవారు వారాల తరబడి ఆహారం, నీరు లేకుండా ఉండగలరు.

మూడవ సిద్ధి అయిన 'కాదివిద్య' సిద్ధించిన వారు తన చుట్టూ ఉండే వాతావరణ పరిస్థితులకు ఏమాత్రం చలించరు. వీరిని చలి, ఎండ, వర్షం మరియు అగ్ని బాధించలేవు.

ఇక నాల్గవ సిద్ధి అయిన 'వాయుగమన సిద్ధి'ని సాధించినవారు ఆకాశంలో ఎగురుతూ ఎక్కడికైనా కన్నుమూసి తెరిచేలోగా వెళ్ళగలరు.

ఐదవ సిద్ధిఅయిన 'మదాలస సిద్ధి'ను సాధించినవారు తమ ఆకారాన్ని అణువంత చిన్నగా గానీ, పర్వతమంత పెద్దదిగా గానీ మార్చుకొనగలరు. రామాయణంలో ఆంజనేయుడు తనకు ఈ విద్య వచ్చిన కారణంగానే సూక్ష్మ రూపాన్ని ధరించి లంకానగరంలో ప్రవేశించాడు.

కనకధారా సిద్ధిని పొందిన వారికి సంపదలు అపారంగా లభిస్తాయి.

ఇక 'ప్రాక్యసిద్ధి' ని పొందిన సిద్ధుడు, తన శిష్యుల్ని సంతానంలేని స్త్రీల గర్భాలలో ప్రవేశించి మరల జన్మించని ఆదేశించి, అమలుచేయగల శక్తిని కలిగి ఉంటాడు.

ఇక ఎనిమిదవ సిద్ధి అయిన సూర్య విజ్ఞానం గురించి పరిశీలిస్తే ఈ విద్యను నేర్చినవారు సూర్యకిరణాల సహాయంతో తాము కోరిన రూపంలోకి మారిపోగలరు. దీన్నే "ఇచ్ఛారూపధారణశక్తి" అని పిలుస్తారు.

సిద్ధులలో అతిశక్తివంతమైనది మృత సంజీవనీ విద్య ఈ సిద్ధిని పొందిన వారు చనిపోయిన వారిని బ్రతికించగలరు. రాక్షస గురువైన శుక్రాచార్యుడు ఈ విద్యలో నిష్ణాతుడు. అమృతం త్రాగిన దేవతలకు మరణంలేదు. అందువల్ల దేవ, దానవ యుద్ధాలలో రాక్షసులు మరణించేవారు. అప్పుడు శుక్రాచార్యుడు తన మృత సంజీవని విద్యను ఉపయోగించి, మరణించిన రాక్షసుల్ని, మరల బ్రతికించేవాడు.

మహాభారత గ్రంథంలో సిద్ధులు ఎనిమిది ఉన్నాయని వాటి అణిమ, మహిమ, గరియ, లఘిమ, ప్రాప్తి, పరకామ్య, ఇస్త్వ మరియు వాస్తవ అని చెప్పబడినది. 'అణిమవిద్య' వచ్చిన వారు తమ దేహాన్ని అణువు అంత చిన్న ఆకారంలోకి మార్చు కొనగలరు. 'మహిమ విద్య' సాధించిన వారు తమ శరీరాన్ని అంతరిక్షం వరకూ పెంచ గలరు. 'గరిమ విద్య' పొందినవారు

తమ శరీరాన్ని పర్వతం అంత బరువు అయ్యేలా చేయగలరు. 'లఘిమవిద్య' నేర్చినవారు తమ శరీర బరువుని 'నువ్వు' గింజంత తక్కువ బరువు ఉండేలా చేసుకొనగలరు. 'ప్రాప్తివిద్య' ను పొందినవారు ఎక్కడికైనా నిరాటంకంగా వెళ్ళగలరు. 'పరకామ్యసిద్ధి'ని పొందిన తాము ఏదికోరితే అది అయ్యేలా చేయగలరు. 'ఇస్త్వసిద్ధిని' పొందినవారు నిరపేక్ష లేదా ఎదురులేని సార్వభౌముడిగా మారి అందర్నీ శాశించగలరు. అష్టసిద్ధులలో ఆఖరిది అయిన 'వస్త్వసిద్ధి'ని పొందినవారు అందరినీ, అన్నింటినీ లొంగదీయగలరు.

ఆంజనేయస్వామి 'అష్టసిద్ధులు' సాధించిన మహాయోగి అని వాల్మీకిమహర్షి, రామాయణంలో అభివర్ణించారు. ఈ అష్టసిద్ధుల్నిఇవ్వగల విధానాలు కొన్నిఉన్నాయి. వాటి గురించి తెలుసుకొందాం. ధ్యానం, జ్ఞానేంద్రియాలను నిగ్రహించటం, భక్తి, వనమూలికలు, మంత్రాలు, ప్రాణాయామం, జన్మత: రావటం అనే విధానాల ద్వారా మానవులకి ఈ అష్టసిద్ధులు లభ్యం కాగలవు.

శ్రీకృష్ణపరమాత్మ ఒకసారి ఇలా అన్నారు "ఇంద్రియాలను నిగ్రహించి, శ్వాసను బంధించి, నాపైనే ధ్యానాన్ని కేంద్రీకరించిన యోగికి లభ్యంకాని సిద్ధులు ఉంటాయా?" అయితే ఈ సిద్ధులు మోక్షమార్గాన్ని అడ్డగిస్తాయని కనుక వీటిని సాధించటం దండగ అని కొందరు భావిస్తారు. కారణం ఏమంటే మహాశక్తుల్ని పొందిన మానవుడికి దైవంపట్ల ఆసక్తితగ్గి, ఇహలోక స్వేచ్ఛాసుఖాలపై అనురక్తి పెరిగే అవకాశాలు అధికం కదా!

# 8. రావణబ్రహ్మకు ఆలయాలు ఉన్నాయా?

రావణాసురుడి గురించి తెలియని భారతీయుడు ఉండడు. గొప్ప శివభక్తుడు, నిఖిల శాస్త్ర పారంగతుడూ అయినప్పటికినీ, పరస్త్రీ వ్యామోహంవల్ల రాముడిచేతిలో దుర్మరణానికి గురి అయ్యాడు. రావణాసురుడి గురించిన పూర్తి వివరాలు చాలామందికి తెలియవు వాటి గురించి క్లుప్తంగా వివరించి, తర్వాత ఆయనకు ఎక్కడెక్కడ ఆలయాలు ఉన్నాయోవివరిస్తాను.

రావణుడి ముత్తాత బ్రహ్మ. రావణుడి తాత పులస్త్యుడు. రావణుడి మాతామహుడు (తల్లికి తండ్రి) మాల్యవంతుడు. మాతామహి (తల్లికి తల్లి) 'తాటకి' అనే రాక్షసి మారీచుడు, రావణునికి మేనమామ అవుతాడు. రావణునికి

ఆరుగురు సోదరులు, ఇద్దరు సోదరీ మణులు ఉన్నారు. రావణుని తండ్రి విశ్వ వసువు. తల్లి 'కైకసి'.

1. అష్టదిక్పాలకులలో ఒకడైన కుబేరుడు రావణునికి అన్నగారు అవుతాడు. వీరిద్దరికే తండ్రి ఒక్కడే, తల్లులు వేర్వేరురుగా ఉన్నారు.

2. విభీషణుడు రావణాసురుడుకి తమ్ముడు. ఇద్దరూ ఏకోదరులు.

3. కుంభకర్ణుడు ఇతడు రావణునికి తమ్ముడు అవుతాడు. వీరిద్దరూ ఏకోదరులు (ఒకే తల్లికి జన్మించారు).

4. కోసల రాజ్యానికి సరిహద్దుగా ఉన్న 'జనస్థాన' రాజ్యాన్ని పాలించే ఖారుడు రావణాసురునికి తమ్ముడు అవుతాడు.

5. దూషణుడు జనస్థాన రాజ్యానికి రాజ ప్రతినిధిగా ఉండేవాడు.

6. అహిరావణుడు రావణాసురునికి అన్నగారు అవుతాడు. ఇతడు పాతాళ రాజ్యాన్ని పాలిస్తూఉండేవాడు.

ఇక రావణుని అక్కాచెల్లెళ్ళ గురించి తెలుసుకొందాం. మహాసౌందర్య రాశిగా పేరు గాంచిన కుంభిని, సాక్షాత్తు రావణునికి అక్కగారు అవుతుంది. ఈమె 'మధుర' రాజ్యాన్ని పాలించిన 'మధు' అనే రాక్షసుడి భార్య. దుష్టగుణాలతో, కామవాంఛలో రావణుడికి సాటి అయిన శూర్పణఖ రావణుని చెల్లెలు. ఈమె కారణంగానే రావణుడు, వనవాసంలో ఉన్న సీతను అపహరించి, ఆపై రాముడిచేతిలో మరణించాడు. మాయాసురుడు అనే దేవ శిల్పి కుమార్తె అయిన మండోదరిని రావణాసురుడు బలాత్కారంగా వివాహ మాడాడు. రావణునికి ముగ్గురు ప్రధాన భార్యలు ఉన్నారు. అతనికి ఏడుగురు మగ పిల్లలు జన్మించారు. రావణుని కుమారులందరూ మహా పరాక్రమ వంతులు. రావణుని కుమారుల పేర్లు క్రింద విధంగా ఉన్నాయి.

1. ఇంద్రజిత్
2. ప్రహస్తుడు
3. అతికాయుడు
4. అక్షయ కుమారుడు
5. దేవాతకుడు
6. నరాంతకుడు
7. త్రిశిరాసురుడు (మూడు తలుగలవాడు)

వాల్మీకి మహర్షి, రావణాసురుడ్ని ఎంత దుర్మార్గుడిగా చిత్రించి రామాయణం వ్రాసినా, ఈ నాటికీ రావణాసురుడ్ని దైవంగా భావించి,

ఆలయాలు నిర్మించి పూజిస్తున్నారు. రావణాసురుడిని ఆరాధిస్తున్న ప్రజల ప్రదేశాల వివరాలు.

1. ఆంధ్రప్రదేశ్‌లోని కాకినాడ పట్టణ సమీపంలోని గంగపుత్రులు (జాలరులు) ఒక శివలింగాన్ని పూజిస్తున్నారు. ఆ శివలింగాన్ని రావణాసురుడే స్వయంగా అక్కడ ప్రతిష్ఠించాడని ఒక విశ్వాసం ఉన్నది. ఈ శివలింగం ప్రక్కన రావణుడి విగ్రహం కూడా ఉన్నది. అక్కడి జాలరులు ఈ శివలింగాన్ని మరియు రావణాసురుడిని పూజిస్తూ ఉన్నారు.



దశకంఠుడు (రావణుడు)

2. శ్రీలంకదేశంలో ఉన్న 'ఎల్లా' లోయలో వెయ్యి సంవత్సరాల క్రితం ఆదేశపు రాజు అయిన వాలగంబ రావణాసురునికి గుహలలో ఆలయాలు నిర్మించాడు.

3. మధ్యప్రదేశ్ రాష్ట్రంలో ఉన్న 'విదిష' జిల్లాలో ఉన్న నేత్రాన్ గ్రామంలో ఉన్న రావణుడి ఆలయంలో ఉన్న రావణుడి విగ్రహానికి పూజలు చేస్తున్నారు. ఆ గ్రామ నివాసులు అయిన 'కన్యకుబ్జ' వర్గానికి చెందిన బ్రాహ్మణులు. ఈ 'కన్యకుబ్జ' బ్రాహ్మణులు రావణుడికి నిత్యం దీప, ధూప, నైవేద్యాలతో పూజా పునస్కారాలు చేస్తున్నారు.

4. ఉత్తరప్రదేశ్‌లోని కాన్పూర్ పట్టణంలో వందల సంవత్సరాల క్రితం ఆ ప్రాంతాన్నిపాలించిన రాజు శివశంకర్ కాన్పూర్‌లో రావణుడికి ఒక ఆలయం నిర్మించాడు. ఈ ఆలయం యొక్క విశిష్టత ఏమిటంటే, ఈ ఆలయాన్ని సంవత్సరానికి ఒకసారి దసరా పండుగ రోజున (విజయదశమి) మాత్రమే తెరచి, ఆ రోజున రావణుని పూజలు చేస్తారు.

5. రాజస్థాన్ రాష్ట్రంలోని (Alvar) 'ఆల్వార్' పట్టణంలో ఉన్న జైన మతస్థుల యొక్క రావణపార్శ్వనాథ ఆలయంలో నేటికీ రావణుడికి పూజలు జరుగుతున్నాయి. పార్శ్వనాధుడు జైనులకు దైవ సమానుడు. ఈ ఆలయ నిర్మాణం గురించిన ఒక ఐహిత్యం గురించి తెలుసుకుందాం.

రావణాసురుడు నిత్యం పార్శ్వనాథుడిని పూజించేవాడట. ఒకసారి అతడు భార్యాసమేతుడై 'అల్వార్' ప్రాంతానికి పర్యటనకి వచ్చాడట. అయితే తన వెంట పార్శ్వనాథుని విగ్రహాన్ని తీసుకురావటం మర్చిపోయిన రావణుడు, అప్పుడు పార్శ్వనాథునికి పూజలు ఎలా జరిపించాలి అన్న విచారంలో పడ్డాడట. అప్పుడు అతని భార్య తన పాతివ్రత్య ప్రభావంలో ఒక పార్శ్వనాథుని విగ్రహం సృష్టించి అతనికిచ్చింది. ఆ విగ్రహాన్ని రావణుడు పూజించి, తర్వాత ఆ విగ్రహాన్ని అక్కడే ప్రతిష్టించాడు. అందువల్ల 'ఆల్వార్'లో పార్శ్వనాథుడిని మరియు రావణాసురుడ్ని పూజిస్తూ ఉన్నారు.

6. రావణాసురుడు, మండోదరిని, జోధ్‌పూర్ (రాజస్థాన్) 32 కిలోమీటర్ల దూరంలో ఉన్న ఒక 'మండపం'లో వివాహం చేసుకున్నాడట. నేడు ఆ ప్రాంతాన్ని మందోదరిపేరు మీదుగా 'మండోర్' అని పిలుస్తున్నారు.

7. ముదల గోత్రానికి చెందిన 'దావే' బ్రాహ్మణులు 'మండోర్'లో స్థిరపడ్డారు. వీరిని రావణాసురుడి వంశస్థులుగా చరిత్ర పేర్కొంటున్నది.

వీరు ఇటీవలికాలంలో జోధ్‌పూర్‌లో రావణాసురుడికి ఒక ఆలయాన్ని నిర్మించి, నిత్యం పూజలుచేస్తున్నారు. ఇంకో ఆసక్తికరమైన అంశం ఏమిటంటే ఈ దవే బ్రాహ్మణులు ప్రతి సంవత్సరం దసరాపండుగరోజున రావణుడికి 'శార్థం' పెట్టి, రావణుడికి ప్రార్థనలు చేస్తారు. తాము రావణుని వంశస్థులు కావటంవల్ల ఇలా చేస్తున్నామని వారు చెపుతున్నారు.

సింహళ జాతీయవాదాన్ని బలపరిచే శ్రీలంక దేశస్థులు కొందరు. శ్రీలంక దక్షిణ ప్రాంతం రావణుడి రాజధానిగా ఉండేదని, రావణుడు సింహళ జాతీయుల నాయకుడనీ వాదిస్తున్నారు.

రావణుడు పుట్టుకరీత్యా బ్రాహ్మణుడు అయినప్పటికినీ మద్యపానం, మాంస భక్షణంచేసేవాడు. అడవి పందుల్ని, జింకల్ని, అడవి బర్రెల్ని, నెమళ్ళని, కోళ్ళని, మేకల్ని, పందుల్ని చంపి వాటి మాంసాన్ని వండి రావణుడికి వడ్డించేవారు అతని వంటవాళ్ళు. మాంసాన్ని పెరుగు లేదా ఉప్పులో ఊరబెట్టి నిల్వ ఉంచే పద్ధతి ఆనాడు 'లంక'లో ఉండేది. భద్రాచలం అడవులలో లభించే ఇప్పపువ్వుల నుండి తయారుచేసిన సారాయిని రావణాసురుడికి అందించేవారు ఆయన సేవకులు. గాలి కన్నా వేగంగా ప్రయాణించే పుష్పకవిమానం రావణాసురుడి దగ్గర ఉన్నది. నిజానికి ఈ విమానం కుబేరుడిది. ఒకసారి రావణుడు కుబేరుడిపై యుద్ధంచేసి, కుబేరుడి దగ్గర నుండి ఆ విమానాన్ని బలవంతంగా స్వాధీనంచేసుకున్నాడు.

# 9. మానవ ప్రాణ రహస్యము ఏమిటి ?

'నాడ్' అనే సంస్కృతపదం యొక్క అర్థం గుల్లగా ఉన్నకాడ అని. ఈ 'నాడ్' అన్న పదం నుండి 'నాడి' అన్న తెలుగు పదము ఆవిర్భవించింది. నాడులు గొట్టముల వంటి అంగాలు అని భావించాలి. ఈ నాడుల కుండా ప్రాణశక్తి శరీరమంతా ప్రవహించును. ఈ నాడులకుండా భౌతికంగా చూస్తే వాయువు, నీరు, రక్తం మరియు పోషక పదార్థాలు శరీరం అంతటా ప్రవహిస్తాయి. మానవ శరీరంలో రక్త ప్రసరణలో తోడ్పడుతాయి. ప్రాణశక్తి అనే అదృశ్యశక్తి నాడుల కుండా ప్రవహిస్తుంది అని హైందవ వేదాంత శాస్త్రాలు చెపుచున్నాయి.

వరాహ ఉపనిషత్ ఇలా చెప్పింది. అరికాలు నుండి నడినెత్తి వరకూ శరీరమంతా నాడులు విస్తరించి ఉంటాయి. శరీరంలో మూడు లక్షల, ఏభైవేల నాడులుంటాయి. ఇందులో 14 నాడులు ముఖ్యమైనవి. ఈ పధ్నాలుగు ముఖ్య నాడులలో మరింత ముఖ్యమైనవి సుషుమ్నానాడి, ఇడానాడి మరియు పింగళనాడి అని శివ సంహిత గ్రంథం బోధిస్తున్నది.

ప్రాణ అంటే శరీరంలోని పంచేంద్రియాలను పనిచేయించేశక్తి అని భావించాలి. ప్రాణాలు ఐదు రకాలుగా ఉంటాయి. అవి

**1. ప్రాణ :** (ఊర్ధ్వశ్వాస) ఇది లోపల, క్రిందవైపు పయనిస్తుంది. ఇది శ్వాసక్రియను, ఆహారాన్ని మ్రింగుటను నడుపుతుంది. మనిషి నేత్రములు, చెవులలో ఇదివశించును. గుండె మరియు ఊపిరి తిత్తులలో ఇది విధులు నిర్వహిస్తుంది ( ఈ ప్రాణం శరీరంలో ఉన్నందుకు చిహ్నం ఏమిటంటే, మీ చెవుల్ని మీ అరచేతుల్లో మూసుకుంటే, మీకు సముద్రపు హెూరు వినిపిస్తుంది. చెవులు మూసుకున్నఉప్పుడు ఆ హెూరు వినిపించకపోతే ఆయుర్దాయం అతి త్వరలో మూగియబోతున్నది అని గ్రహించాలి).

**2. అపాన :** ఇది మూలాధార చక్రము (Anus గుదము) నందు వశించును. ఇది మల, మూత్ర విసర్జనలను నియంత్రిస్తుంది. గర్భధారణకు, ప్రసవానికి, వీర్య స్కలనానికి మరియు అపాన వాయువుకు కారణమగును.

**3. సమాన :** బొడ్డునందుగల మణిపుర చక్రములో ఇది ఉండును. ఇది జఠరాగ్నిని (జీర్ణశక్తి) మండేలాచేస్తుంది. హృదయం నుండి నాభివరకు గల అన్ని శరీర భాగాలకు చెందిన ఇది జీవన కార్యాలు ఇది నిర్వహిస్తుంది.

**4. ఉదాన :** కంఠంలోని స్వరపేటికపైన ఉండే విశుద్ధచక్రములో ఈ ప్రాణం వశిస్తుంది. వాక్‌శక్తిని, నిద్రని నియంత్రిస్తుంది. వెన్నుపాముకుండా పైభాగానికి వెళ్ళే కుండలినీ శక్తికి సహకరించేది ఈ ప్రాణమే.

**5. వ్యాన :** ఇది గుండ్రంగా చలిస్తుంది. ఇది ప్రాణ మరియు అపాన వాయువుల కలయికచే ఏర్పడును. ఇదినాడుల ద్వారా శరీరమంతటా ప్రవహించును. 'వ్యాన' అంటే వ్యాప్తిచెందునది అని అర్ధం. ఈ అయిదు ప్రాణాలు శరీరం కొనసాగుటకు తోడ్పడును. సాంఖ్యాశాస్త్రం (కపిల మహర్షి) ఈ ఐదు ప్రాణాలేకాక ఇంకో ఐదు సహాయ ప్రాణములు మానవ శరీరంలో ఉన్నాయని చెపుతున్నది. అవి ఏమిటంటే నాగ, కూర్మ, క్రుకార, దేవదత్త మరియు ధనుజయ. ఇవి వాంతికి, కన్నులు ఆర్పుటకు, ఆకలిని కల్గించుటకు, ఆవులింతలు కల్గించుటకు మరియు శరీర పోషణకు కారణమగునని కపిలమహర్షి చెప్పారు.



**శరీరంలోని జీవుడు**

ఐదు జ్ఞానేంద్రియాలు, ఐదు క్రియా అంగాలు, ఐదు ప్రధాన వాయువులు (ప్రాణ, అపాన, సమాన, ఉధాన మరియు వ్యాన) మరియు మెదడు, అంతరంగ జ్ఞానం ఈ పదిహేడు అంశాలు కలిస్తే సూక్ష్మశరీరం అగును. లేదా లింగశరీరం అంటారు.

**వేదాంత చిత్రములు :** లేళ్ళకు శబ్దము అంటే ప్రీతి, ఏనుగుకి స్పర్శ ప్రీతి, మిడుతకు రూపం అంటే ప్రీతి, చేపకు రసం అంటే ప్రీతి, తుమ్మెదకు గంధ (వాసన) ప్రీతి స్వభావ సిద్ధముగా అబ్బును. ఈ అయిదు ప్రాణులూ తమ తమ స్వభావములను అనుసరించి శబ్దము నుండి గంధము వరకు గల విషయముల యందుగల ప్రీతి వలన మృత్యువాత పడుతున్నాయి. అంటే వాటి బలహీనతలే వాటికి చావుని ఇస్తున్నాయన్నమాట.

ఈ ప్రపంచానికి ఆధారమైనది ఏదీలేదని, భగవంతుడు అనే వాడులేడని, కామ ప్రేరితులు అయిన స్త్రీ, పురుషుల సంయోగము వలన జీవులు సహజంగా పుడుతున్నారని, సృష్టికి కారణము కేవలం కామమే అని వాదించువాళ్ళు అసురులు (రాక్షసులు) అని గ్రహించాలి. ఇట్టివారి శక్తి, సామార్ధ్యాలు ప్రపంచ వినాశనానికే పనికివస్తాయి. తమ అనైతిక వ్యాపారములను సమర్ధించు

కొనుటకు మిథ్యా సిద్ధాంతములను ప్రకటిస్తారు. చార్వాకుడి నాస్తిక వేదాంతం అలాగే ఉంటుంది.

కామ, క్రోధ, లోభములు అనే మూడు అవలక్షణాలు నరకద్వార ములు. ఇవి ఆత్మ నాశనానికి కారణము కాగలవు.

పక్షులు రాత్రివేళలందు భూమి,పై సంచరించవు. ఏదైనా చెట్లపైన, ఇంటిపైన ఉంటాయి. అందుకుగల కారణం ఏమిటంటే రాత్రి సమయాలలో భూమి మండుతున్న అగ్నివలె పక్షుల కంటికి కనిపిస్తుంది.

సముద్ర జలాన్ని దైవం యొక్క మూత్రమని హైందవ శాస్త్రాలు చెప్పుట వలన సముద్ర జలాన్ని ఎవరూ త్రాగరు.

# 10. నిజం అని ప్రపంచం నమ్ముతున్న 6 ప్రఖ్యాత శాపాలు

బైబిల్ గ్రంధంలో తెలియజేసిన సమాచారం ప్రకారం ఆడమ్ మరియు ఈవ్ అనే తొలిమానవ జంటను తన దుర్బోధతో తప్పుదోవ పట్టించి వారిచేత దైవం నిషేదించిన "పాపపుపండు" (నిషిద్ధఫలము)ను తినేలా చేసిన సాతానుకి తొలి శాపాన్ని తన ఆజ్ఞను ధిక్కరించి నిషిద్ధఫలాన్ని తిన్న ఆదామ్ జంటకు ఇకపై మానవజాతి అష్టకష్టాలు పడాలి అన్న రెండవ శాపాన్ని ఇచ్చాడు దేవుడు. (తొలి మానవ జంట అయిన ఆడమ్ మరియు ఈవ్‌ల సంతానమే నేటి సమస్త మానవజాతి అనీ, దైవశాపం వల్లనే నాటి ఆడమ్ వారసులయిన నేటి మానవులు అనేక రోగాలకు, కష్టాలకు గురి అవుతున్నారని బైబిల్ గ్రంధము ప్రబోధిస్తున్నది.

**1. దయ్యం పట్టిన కారు :**

సెప్టెంబర్ 30, 1955లో జేమ్స్‌డీన్ అనేవ్యక్తి తనముద్దులకారు. 'లిటిల్ బాస్టర్డ్‌లో ప్రయాణిస్తూ ఉండగా, ఎదురుకుండా వస్తున్న ట్రక్ ఢీకొని ఆకారు యజమాని 'డీన్' ఘోరంగా మరణించాడు. 'డీన్' మరణించిన సంవత్సర కాలంలోగా ఆకారు వలన ముగ్గురు చనిపోయారు. ఆరుగురు తీవ్రంగా గాయపడ్డారు. ఆ తర్వాత ఆ కారుని జార్జిబారిస్ అనే వ్యక్తికొన్నాడు. బారిస్ ఆకారుని కొని మరమత్తులు చేయిస్తుండగా (కారుని గొలుసులతో పైన వ్రేలాడదీసి) ఆ కారు క్రిందపడి, క్రింద ఉన్న మెకానిక్ కాళ్ళు చేతుల్ని బలి

తీసుకుంది. దాంతో ఆకారు కొత్త యజమాని అయిన బారిస్ ఆ కారు ఇంజన్ని ఒకరికి, ట్రాన్స్‌మిషన్‌న్ని ఒకరికి అమ్మాడు. ఆ కారు భాగాలు బిగించిన వేరే కార్లు ప్రమాదానికి గురి అయ్యాయి. ఇంజన్ బిగించిన కారు డ్రైవర్ మరణించాడు. ట్రాన్స్‌మిషన్ బిగించిన కారు డ్రైవర్ తీవ్రంగా గాయపడి ఆసుపత్రిపాలయినాడు. ఆ కారు టైర్లు ఒక డ్రైవర్ కొని తన కారుకి వేయగా, ఆ టైర్లు పగిలి కారుకి ప్రమాదం జరిగి కారు డ్రైవర్‌కి చచ్చినంతపని అయ్యింది.

ఇక ఆ తర్వాత, ఇంజన్‌లేని ఉత్తకారుగా మిగిలిన లిటిల్ బాస్టర్డ్‌ని ఒక కార్ల ఎగ్జిబిషన్‌లో పెట్టాలని ప్రయత్నించారు. రేపు ప్రదర్శన ప్రారంభం అవుతుందనగా ఈ రాత్రికి ఆ కారు ఇతర కారులు ఉన్న హాలులో పెద్ద అగ్ని ప్రమాదం జరిగి ఒక్క లిటిల్ బాస్టర్ తప్ప మిగిలిన అన్నికార్లు అగ్నికి ఆహుతి అయిపోయాయి. ఆశ్చర్యం ఏమిటంటే ఇంత దుర్ఘటన జరిగిన ఆ కారుపై చిన్న మరకకూడా పడలేదు. దాంతో కారు మహత్తు పసిగట్టిన కార్ల ఎగ్జిబిషన్ నిర్వాహకులు లిటిల్ బాస్టర్డ్‌ని ఒక ట్రక్‌పైన ఎక్కించి, సాలినా (కాలిఫోర్నియా)కు తిరిగి పంపించారు. ట్రాలర్‌పై కారును వేసుకొని వెళ్తుండగా ట్రక్ అదుపుతప్పి, ఎవరో నెట్టివేసినట్టుగా డ్రైవర్‌రోడ్డుపై పడ్డాడు. సరిగ్గా అదే సమయానికి ట్రాలర్‌లో గొలుసులతో కట్టివేయబడిఉన్న లిటిల్ బాస్టర్డ్ గొలుసులనుండి విడిపడి, రోడ్డుమీదపడిన డ్రైవర్‌పై వ్రాలింది. దాంతో ఆ డ్రైవర్ ఆ కారు క్రిందపడి చితికిపోయాడు. హైవేమీద డ్రైవర్ లేకుండానే సంచరించే ఆ కారు చివరిసారిగా హైవేమీద గస్తీ తిరుగుతున్న కాలిఫోర్నియా పోలీసులకి 1960లో కనిపించింది. ఆపై లిటిల్ బాస్టర్డ్ ఎవరికీ కనిపించలేదు. లిటిల్‌బాస్టర్డ్ శాపగ్రస్తమైన కారు అని కొందరు, దయ్యంపట్టిన కారు అని కొందరు వాదించారు. ఏదిఏమైనా ఈ ఉదంతం మాత్రం నిజంగా జరిగింది.

## 2. టుటంఖమన్ సమాధి శాపం :

మమ్మీలు ఉన్న పిరమిడ్లలో ఉండే బంగారం, రత్నాలకోసం ఆశపడి ఆ పిరమిడ్లను త్రవ్వి, పిరమిడ్లలో జోరపడ్డవాళ్ళకి శాపాలు తగిలి దుర్మరణం పాలు అవుతారని 'శాపం' ఉన్నది. ఈ 'శాపం' నిజంగా ఫలించినట్టుగా ఆధారాలున్నాయి. 'ఫారోలు' అని పిలువబడే ఈజిప్టు రాజుల పిరిమిడ్లని త్రవ్విన పురావస్తు శాస్త్రజ్ఞులు, త్రవ్వకాలలో పనిచేసిన కార్మికులు అకాలమరణం పొందిన దాఖలాలు అనేకం ఉన్నాయి. 'టుటంఖమన్' అనే ఫారో రాజుగారి సమాధిని త్రవ్విన వారికి మరణం తప్పదు అన్న శాపం ఉన్నది. 'సమాధి' అంటే పిరమిడ్ అని గ్రహించాలి.

జార్జి హెర్బర్ట్ అనే ఇంగ్లీష్ జమిందారు ఆర్థిక సాయంచేయగా 1922లో హోవార్డ్ కార్టర్ అనే సాహసికుడు, ఈజిప్ట్ రాజైన (ఫారో) టుటంఖామన్ సమాధిని త్రవ్వి అందులోకి ప్రవేశించాడు. అతనితోపాటు ఆ సమాధి త్రవ్వకాలలో పాల్గొన్న కూలీలుకూడా సమాధిలోకి వెళ్ళారు. అక్కడ ఒక మమ్మీ మరియు అత్యంత విలువైన రత్నాలు, బంగారు ఆభరణాలు కన్పించాయి.


ఫారోరాజు (టుటంఖమన్)

ఆ తర్వాత ఎన్నో మానవాతీత సంఘటనలు జరిగాయి. కైరోలో విలాసయాత్ర చేస్తున్న ఇంగ్లీషు జమిందారు జార్జిహుర్బర్ట్‌కి దోమకాటు వల్ల నిమోనియా వచ్చింది. ఆపై ఆయన రక్తం విషపూరితం అయ్యింది. ఒకరోజు అర్ధరాత్రి కైరో నగరం (ఈజిప్ట రాజధాని)లో దీపాలు ఆరిపోయాయి. అంతా చీకటి ఆ రాత్రే జార్జిహెర్బర్ట్ రక్తం కక్కుకుని చనిపోయాడు. మర్నాడు ఉదయం ఆయన పెంపుడు కుక్కహతాత్తుగా చచ్చిపడిపోయింది. ఇది జరిగిన కొద్ది కాలానికి సమాధిలో ప్రవేశించిన హోవార్డ్‌కార్టర్ మరియు అతని కూలీలు కూడా వేరు, వేరు ప్రమాదాలలో దారుణంగా మరణించారు. టూటంఖామన్ సమాధిపైన ఉన్న ఒక శిలాఫలకంపైన ఒక శాపం వ్రాయబడి ఉన్నది. అది ఏమంటే "ఫారో రాజు సమాధిలో ప్రవేశించిన వారి దగ్గరకు మృత్యువు రెక్కలుకట్టుకొని వచ్చి వ్రాలుతుంది.

### 3. ఆటగాళ్ళకి శాపం :

అమెరికాలోని ఒక రాక్ మ్యూజిక్ క్లబ్‌లో సభ్యులుగా ఉండేవారు తమ 27వ ఏడు రాగానే మరణిస్తూ ఉంటారు. ఇది ఆ క్లబ్‌కి ఉన్నశాపం. రాబర్ట్‌జాన్సన్ అనే ఆఫ్రికా జాతికి చెందిన 'రాక్' స్టార్ ప్రపంచ ప్రఖ్యాతి చెందినవాడు. ఇతడికి 27వ ఏడు రాగానే గిటార్ వాయిస్తూ హఠాత్తుగా మరణించాడు. ఇదే క్లబ్‌లో సభ్యులైన అనేకమంది రాక్ సంగీత కళాకారులు తమకి 27వ ఏడు రాగానే ఏదోఒక విధంగా మరణించారు. 1969లో బ్రెయన్ జోన్స్, 1970లో జిమి హెంట్రిక్స్ మరియు జానిస్ జోప్లిన్, 1971లో జిమమారిస్య (వీళ్ళందరూ ఈ క్లబ్ సభ్యులే) తమ 27వ ఏడు రాగానే మృతి చెందారు. ఇది యాదృచ్ఛికమా? లేక 'శాపాలు' అనేవి నిజంగా ఉన్నాయా?

**4. డాబిల్లీగోట్ శాపం :**

ఈ సంఘటనలో విలియం బిల్లీగోట్, తన పెంపుడు మేక 'మర్ఫీ'లో కలిసి 1945లో చికాగో కబ్స్ మరియు డెట్రాయిట్ టైగర్స్ మధ్య జరిగిన 4 గేమ్స్ చూడటానికి వెళ్ళాడు. రిగ్లీఫీల్డులో ఈ మ్యాచ్ జరిగింది. అయితే ఆ తర్వాత విలియంని, అతిని మేకను బయటకి పంపేసారు. దాంతో ఆగ్రహించిన విలియం తనని బైటికి పంపిన 'కబ్స్' టీం ఇకపై గెలవరాదని శపించాడు. అప్పటి నుండి 'కబ్స్' (cubs) కి దురదృష్టం పట్టింది. ఆనాటి నుండి ఈనాటికీ 'కబ్స్'కి ఛాంపియన్‌షిప్ రాలేదు.

**5. మంత్రగాడి శాపం :**

19వ శతాబ్దంలో రష్యాలో రాస్‌పుటిన్ అనే గొప్పమాంత్రికుడు ఉండేవాడు. ఆనాడు రష్యాను పాలిస్తున్న రోమనోవా రాజకుటుంబంవారికి చెందిన రాజభవనంలోకి ఆ మాంత్రికుడు తన మంత్రశక్తుల్ని ఉపయోగించి ప్రవేశించాడు. ఆతర్వాత రాజ కుటుంబంలోని ఇద్దరు, ముగ్గురు స్త్రీలని తన మంత్రశక్తితో వశపరచు కున్నాడు. అందుకు ఆగ్రహించిన ఆ రాజకుటుంబంవారు రాస్‌పుటిన్ ని చంపించాలని నిర్ణయించుకున్నారు. ఆ మంత్రవాదిని చంపటానికి నిర్ణయించు కున్నారు. ఆ మంత్రవాదిని చంప టానికి విషంపెట్టి ఒకసారి, మేడమెట్ల మీద నుండి క్రిందికితోసేసి ఒకసారి, తుపాకితో పలుసార్లు కాల్చి చంపాలని ప్రయత్నించారు. చివరికి వాళ్ళ ప్రయత్నాలు ఫలించి రాస్‌పుతిన్ తీవ్రంగా గాయపడి మరణశయ్యపైకి చేరాడు. అతనికి కనీసం మాట్లాడేశక్తికూడా పోయింది. ఇంకా కొద్దిక్షణాలలో చనిపోతాడనగా అతడు తనని చంపుతున్న రోమనోవా రాజవంశంలోని వారు ఒక్క సంవత్సరంలోగా దుర్మరణంపాలు అవ్వాలని శపించాడు. చివరికి రాస్‌పుతిన్ మరణించాడు. సరిగ్గా సంవత్సరం ముగిసేలోగా ఆరాజకుటుంబాన్ని విప్లవకారులు హత్య చేసారు. సామూహిక హత్యాకాండలో ఆ రోమనోవా రాజకుటుంబం మొత్తంఅంతం అయిపోయింది.



**6. ఆటవికుడి శాపం :**

1840లో అమెరికా అధ్యక్షుడిగా పనిచేసిన 'విలియంహెహారీ', ఏదో కారణంగా ప్రభుత్వానికి ఎదురు తిరిగిన స్థానిక అమెరికన్ ఆటవికులను యుద్ధంలో ఓడించి వారి నాయకుడిని అంతంచేసాడు. మరణించబోయే ముందు ఆ నాయకుడు ఇలా శపించాడు 'ఈనాటి నుండి ప్రతి 20 ఏళ్ళకీ ఒక అమెరికా అధ్యక్షుడు (పదవిలోఉండి) మరణిస్తాడు'. ఆ నాయకుడి శాపం 1840 నుండి 1960 దాకా నిజం అయ్యింది. అదెలాగో పరిశీలిద్దాం.

1. తెగ నాయకుడిని చంపించిన అమెరికా అధ్యక్షుడు 1840లో పదవిలోకి వచ్చిన సరిగ్గా ఒక నెలకి 'నిమోనియా' వచ్చి చనిపోయాడు.

2. అబ్రహాం లింకన్ 1960లో పదవిలోకి వచ్చాడు. 1965లో హత్యచేయబడ్డాడు.

3. జేమ్సగారీ ఫీల్డు 1880లో అమెరికా అధ్యక్షుడు అయ్యాడు. 1881లో కాల్చిచంపబడ్డాడు.

4. విలియం మెకన్లీ 1896లో అమెరికా అధ్యక్షుడు అయ్యాడు. మళ్ళీ 1900లో ఎన్నికయి 1901లో కాల్చిచంపబడ్డాడు.

5. 1920లో U.S.A. అధ్యక్షుడిగా ఎన్నికయిన వాలెన్‌జిహార్డింగ్ గుండెనెప్పివచ్చి చనిపోయాడు.

6. 1932 నుండి 1944 దాకా నాలుగుసార్లు అమెరికా అధ్యక్షుడిగా పనిచేసిన F.D. రూజ్వెల్ట్ 1945లో మెదడులో రక్తస్రావం జరిగి చనిపోయాడు.

7. జాన్ F. కెనడీ 1960లో అమెరికా అధ్యక్షుడిగా ఎన్నిక అయి మూడేళ్ళ తర్వాత కాల్చిచంపబడ్డాడు.

8. 1980లో అమెరికా ప్రెసిడెంట్‌గా ఎన్నికయిన రోనాల్డ్ రీగన్‌పై 1981లో హత్యాప్రయత్నం జరిగినా, తప్పించుకొన్నాడు. అప్పటినుండి అమెరికా అధ్యక్షులకున్నశాపం తొలగిపోయింది అని తెలిసింది. జార్జిబుష్, అతని కుమారుడు, క్లింటన్, ప్రస్తుత అధ్యక్షుడు బరాక్‌ఒబామాలు క్షేమంగా ఉన్నారు. శాపాలకు నిజంగా శక్తి ఉంటుందా? అని ప్రశ్నిస్తే, ఉంటుంది అని చెప్పితీరాలి. అయితే నిర్మలమైన మనస్సుగల వ్యక్తులు ఎవరినీ శపించరు.

పిల్లిశాపాలకు ఉట్లుతెగుతాయా? అన్న సామెత ఉన్నది. అంటే మానసికబలం లేకుండా, ఇతరులని శపిస్తే అవి ఫలించవు. శాపం ఏ కారణంగా

అయినారావచ్చు. పాముల్ని అంటే నాగుపాముల్ని చంపినవాళ్ళకి సర్పదోషం లేదా సర్పశాపం తగలి సంతాన భాగ్యం కలుగకుండా పోతుంది. అట్టి పరిస్థితిలో నాగప్రతిష్టలు చేయిస్తే నాగశాపం తొలగి సంతానభాగ్యం కలుగుతుంది అని శాస్త్రాలు చెపుతున్నాయి.

## 11. కేరళలో చిలిపిదైవం కుట్టిచేతన్ వివరాలు

కేరళలో (శబరిమలై)లో వెలసిన స్వామి అయ్యప్ప గురించి అందరికీ తెలుసు. త్రివేండ్రమ్‌లో కొలువుదీరిన అనంతపద్మనాభస్వామి గురించి కొందరికి తెలుసు. గురువాయూర్‌లో వెలసిన శ్రీకృష్ణుడి గురించి చాలాకొద్దిమందికే తెలుసు. అయితే చాలామందికి తెలియని ఇంకోదైవం కేరళ పురాణాలలో కనిపించే 'చేతన్' ఈ కలియుగదైవం 'చేతన్' ఎలా ఆవిర్భవించాడో తెలిపే గాధ గురించి తెలుసుకొందాం!

ఒకసారి ఈశ్వరుడు, పార్వతి భూమిమీదకు వచ్చారు. అలా భూమిపై సంచరిస్తున్న శివ, పార్వతులు కేరళ రాష్ట్రంలో అన్న 'కులికున్నన్' అడవులలో సంచరిస్తూ ఉండగా, అడవి మధ్యలో ఉన్న ఒక నదిలో స్నానంచేయటానికి నిర్ణయించుకున్నాడు శివుడు. పార్వతి మాత్రం ఆ అడవిలో సంచరించటానికి వెళ్ళింది. శివుడు ఆ నదిలో దిగిస్నానంచేసి, ఒడ్డుకు వచ్చాడు. అప్పుడాయనకి ఒక నవయవ్వనవతి ఐన ఒక గిరిజన యువతి కనిపించిది. ఆమె ముగ్ధమోహన ముఖ సౌందర్యానికి, మైమరిపించే శరీర లావణ్యానికి చలించిన శివుడు ఆమెను పలకరించి ఆమె వివరాలను తెలపమని కోరాడు. అప్పుడు ఆ గిరిజన యువతి తనపేరు "కూలివక" అని చెప్పింది.

ఆమెను చూసిన మరుక్షణం నుండి శివునికి కామజ్వరం అధికమయ్యింది. అంతలో ఆ గిరిజన యువతి తనదారిన తాను వెళ్ళిపోయింది. ఆ గిరిజన యువతిపైన మరులు గొన్న శివుడు మనస్సు చెలించి ఆ నదిగట్టునే కూర్చుని ఉండి పోయాడు. అడవిలో సంచరిస్తున్న పార్వతి దివ్యదృష్టిద్వారా శివుడు పడుతున్న బాధను గురించి తెలుసుకున్నది. వెంటనే ఆమె గిరిజన యువతి "కూలివక" రూపాన్ని ధరించి శివుడి దగ్గరికి వెళ్ళింది.

తనకు దూరమయ్యింది అనుకున్న "కూలివక" మరల తన దగ్గరకు రావటంతో శివుడు ఆమెను సమీపించి గాఢాలింగనం చేసుకున్నాడు. ఆపై

వారిద్దరు కొద్ది రోజులుపాటు ఆ నది ఒడ్డునే అనేక రకాలుగా శృంగారం జరుపుకున్నారు. వారి కలయిక ఫలితముగా వారికి ఒక దివ్యతేజస్సుగల బాలుడు జన్మించాడు. తరువాత పార్వతి పరమేశ్వరులు గిరిజన యువతి అయిన "కూలివక" వద్దకు పోయి తమకు పుట్టిన బిడ్డను "కూలివక"కు ఇచ్చి పెంచమని కోరారు. అలా శివపార్వతులకు పుట్టిన బిడ్డ గిరిజన యువతి అయిన "కూలివక" దగ్గరపెరిగాడు.


భగవాన్ శ్రీచేతన్‌స్వామి (కుట్టిచేతన్)

అయితే సాక్షాత్తు శివుడే ఒక మానవ స్త్రీని చూచి మోహించటం ఏమిటి? అన్న సందేహం ఎవరికయినా వస్తుంది.

ఈ సంఘటనలు జరగటానికి ప్రధాన కారణం ఏమిటంటే ఆకాలంలో భృంగాసురుడు అనే రాక్షసుడు, దేవతలను, మానవులను తీవ్రంగా హింసిస్తూ ఉండేవాడు. ఆ రాక్షసుడిని చంపటానికి ఒక దైవ పుత్రుడు అవతరించాల్సి ఉన్నది. ఆ కారణంగానే "కూలివక" వ్యామోహంలో శివుడు పడటం, పార్వతి "కూలివక" రూపంలో రావటం శివపార్వతుల సంయోగంవల్ల "చేతన్" అనే మగబిడ్డ పుట్టటం జరిగింది.

శివపార్వతుల పుత్రుడయిన "చేతన్" తన ఏడు సంవత్సరాల ప్రాయంలో భృంగాసురునితో యుద్ధంచేసి అతడిని సంహరించాడు. ఈ శివపుత్రుడే తర్వాతి కాలంలో "భగవాన్ శ్రీచేతన్" స్వామిగా పేరు పొందాడు. ఒకసారి "చేతన్" స్వామి తన వాహనమైన బట్టెను అధిరోహించి కైలాసానికి వెళ్ళాడు. సహజంగా చిలిపి వాడైన "చేతన్" స్వామి కైలాసంలో అడుగు పెట్టగానే నాలుగు చేతులలో శంఖం, చక్రం, గద మరియు పద్మము ధరించి ఉండే శ్రీమహావిష్ణువు రూపంధరించి శివపార్వతుల సన్నిధికి వెళ్ళాడు.

శ్రీమహావిష్ణువు వేషంలో తన దగ్గరకు వచ్చిన తన బిడ్డను చూసిన శివుడు పరమానందంతో గాఢాలింగనం చేసుకున్నాడు. ఆపై "చేతన్" స్వామిని ఇలా దీవించాడు. ఇకపై నీవు "విష్ణుమాయ"గా పిలువబడతావు. ఆనాటి

నుండి "చేతన్" స్వామిని "విష్ణుమాయ" అనేపేరుతో కూడా భక్తులు పిలుస్తున్నారు. కలియుగంలో సంభవించే సమస్త అరిష్టాలనుండి మానవులను కాపాడుటకు త్రిమూర్తులచే సృష్టించబడ్డ మహాశక్తి "శ్రీచేతన్" భగవాన్. అడవులలో పుట్టటం వల్ల ఈ స్వామిని "చేతన్" అనీ, శ్రీమహావిష్ణువు రూపం ధరించటం వల్ల "విష్ణుమాయ" అనీ ఈయనకు పేర్లు వచ్చాయి. ఈ కలియుగానికి భగవాన్ చేతన్ స్వామి ప్రత్యక్ష దైవమని కేరళ రాష్ట్రానికి చెందిన పురాణాలు చెప్పుచున్నాయి. శ్రీ చేతన్‌స్వామి చూపే లీలలకు, మహిమలకు పరవశించని భక్తుడే ఉండడు. కేరళ రాష్ట్రంలో అనేక ప్రాంతాలలో శ్రీచేతన్‌స్వామి ఆలయాలు ఉన్నాయి. వీటిలో ప్రధానమైనది "త్రిచూర్" జిల్లాలో ఉన్న "కారన్‌యిల్ మాడమ్" (Karanayilmadon) అని తెలుస్తున్నది.

చేతన్‌స్వామికి చెందిన ఇంకోరకం కథకూడ కేరళలో ప్రచారంలో ఉన్నది. అది ఏమిటంటే "కుట్టిచేతన్" అనే విచిత్రంగా ప్రవర్తించే ఒక ఆత్మ ఉందని, ఆ ఆత్మ కొందరికి కన్పించి మంచి చేస్తుందని ఒక నమ్మకం కేరళలో ప్రచారంలో ఉన్నది.. మళయాళ భాషలో "కుట్టి" అనగా చిన్న బాలుడు లేదా బాలిక అనిఅర్థం. "చేతన్" అంటే మహాపండితుడు అని అర్థం. "కుట్టిచేతన్" అంటే మహాపండితుడైన బాలుడు అనే అర్థం. ఈ "కుట్టిచేతన్" మరియు "భగవాన్ శ్రీచేతన్" అనేరెండు పేర్లు ఒక్కరి గురించే అని తెలుస్తున్నది.

## 12. అష్టాదశ పురాణముల వివరములు ఏమిటి?

పురాణ అంటే పురాతన కాలంనాటిది అని అర్థం. భగవద్ భక్తిని గురించి వివరిస్తాయి పురాణాలు. హైందవ పురాణాలలో ప్రముఖమైనవి 18 అని తెలుస్తున్నది. ఆరు పురాణాలు మహావిష్ణువుకి సంబంధించినవి, ఆరు పురాణాలు శివుడికి సంబంధించినవి, ఆరు పురాణాలు బ్రహ్మదేవుడికి సంబంధించినవి అని ఈ 18 పురాణాలూ విభజించబడ్డాయి. 18 పురాణాల వివరాలు క్రింద ఇస్తున్నాను. పరిశీలించండి.

1. బ్రహ్మపురాణం - 24,000 శ్లోకాలు
2. పద్మపురాణం - 55,000 శ్లోకాలు

3. విష్ణుపురాణం - 23,000 శ్లోకాలు
4. శివపురాణం - 24,000 శ్లోకాలు
5. భాగవతపురాణం - 18,000 శ్లోకాలు
6. నారదపురాణం - 25,000 శ్లోకాలు
7. మార్కండేయపురాణం - 9,000 శ్లోకాలు
8. అగ్నిపురాణం - 15,400 శ్లోకాలు
9. భవిష్యపురాణం - 14,500 శ్లోకాలు
10. బ్రహ్మపురాణం - 18,000 శ్లోకాలు
11. లింగపురాణం - 11,000 శ్లోకాలు
12. వరాహపురాణం - 10,000 శ్లోకాలు
13. స్కాందపురాణం - 81,000 శ్లోకాలు
14. వామనపురాణం - 10,000 శ్లోకాలు
15. కూర్మపురాణం - 17,000 శ్లోకాలు
16. మత్స్యపురాణం - 14,000 శ్లోకాలు
17. గరుడపురాణం - 19,000 శ్లోకాలు
18. బ్రహ్మాండపురాణం - 12,000 శ్లోకాలు

మహాభారతాన్ని వ్రాసిన వేదవ్యాస మహర్షి ఈ పురాణాల్ని సంకలనం (compile) చేసాడని పెద్దల ఉవాచ. చందోగ్య ఉపనిషత్ మరియు బృహదరణ్యక ఉపనిషత్తులు క్రీ.పూ. 500వ సంవత్సరానికి చెందినవి. ఈ ఉపనిషత్తులు, 18 పురాణాలనూ 'పంచమవేదం'గా అభివర్ణించాయి. ఇందులో స్కాందపురాణం అతి పెద్దది. తీర్ధయాత్రలు చేసేవారికి ఆనాడు ఇది ఒకమార్గదర్శి (Guide)గా రూపొందించబడింది. భారతదేశంలో ఆనాడు ఉన్నయాత్రా స్థలాలగురించి సవివరంగా ఈ పురాణంలో వర్ణించబడి ఉన్నది.

ఇంకావాయుపురాణం (24,000 శ్లోకాలు), హరివంశపురాణం (16,000 శ్లోకాలు) అనే రెండు పురాణాలుకూడా ఉన్నాయి. త్రిమూర్తులకు సంబంధించిన పురాణాలుగా ఈ 18 పురాణాలు విభజించబడ్డాయి. ఆ విభజన క్రింది విధంగా ఉన్నది.

**1. బ్రహ్మదేముడు :** బ్రహ్మపురాణం, బ్రహ్మాండపురాణం, బ్రహ్మ వైవర్తన పురాణం, మార్కండేయపురాణం మరియు భవిష్యపురాణం.

**2. విష్ణు సంబంధ పురాణాలు :** విష్ణుపురాణం, భాగవతం, నారదపురాణం, గరుడపురాణం, పద్మపురాణం, వరాహపురాణం, వామనపురాణం, కూర్మపురాణం, మత్స్యపురాణాం మరియు కల్కిపురాణం.

**3. శివసంబంధ పురాణాలు :** శివపురాణం, లింగపురాణం, స్కాందపురాణం, అగ్నిపురాణం మరియు వాయు పురాణాలు. ఈ పురాణాల్ని సత్వ, రజ, తమోగుణాలు ఆధారంగా పద్మపురాణంలో మూడు రకాలుగా వర్గీకరించబడ్డాయి.

**సత్వపురాణాలు :** విష్ణుపురాణం, భాగవతం, నారదపురాణం, గరుడ పురాణం, మార్కండేయపురాణం, భవిష్యపురాణం, వామనపురాణం మరియు బ్రహ్మపురాణాలు.

**తామసగుణ ప్రధానాలు :** మత్స్యపురాణం, కూర్మపురాణం, లింగపురాణం, శివపురాణం, స్కాందపురాణం మరియు అగ్ని పురాణములు.

**స్థలపురాణాలు :** వీటిలో కొన్ని ఆలయాల, పుణ్యక్షేత్రాల గురించిన వివరాలు ఉన్నాయి.

**కుల పురాణాలు :** ఒక కులం ఎలా ఏర్పడింది? వాళ్ళ కులానికి మూల పురుషుడు ఎవరు అని తెలిపే పురాణాలు కులపురాణాలు. ఉదాహరణకు శాలివాహన పురాణం కుమ్మరి (Pottery) వారి కుల ఆవిర్భావం గురించి తెల్పును.

ఇంకా జైన మత సిద్ధాంతాలు, విశ్వాసాల గురించి తెలిపే జైన పురాణాలు (కన్నడభాష), బౌద్ధమతం గురించి తెలిపే బౌద్ధపురాణాలు కూడా ఉన్నాయి.

## 13. సాతాను (Satan) ఈ లోకాన్ని పాలించబోతున్నాడా?

సాతాన్ అనే ఆంగ్లపదం దైవ విరోధియైన ఒక దుష్టశక్తిని సూచిస్తుంది. పాశ్చాత్యులు దైవ విరోధిని సాతాన్ అని పిలువగా ముస్లింలు సైతాన్ అని పిలుస్తారు. ఇంకా యూదులలోను, జురాష్టియన్ మతంలోను సైతాన్ అనే భావన ఉన్నది. "యాంటీక్రిస్ట్" (Anti christ) అనే ఇంగ్లీషు పదానికి దైవ

విరోధి లేదా క్రీస్తు విరోధి అని అర్థం. అయితే పెద్దగా చదువుకానీ, జనరల్‌నాలడ్జిగానీ లేని స్థానిక తెలుగు క్రైస్తవమత ప్రచారకులు ఈ యాంటిక్రిస్ట్ అనేపదాన్ని అంతిక్రీస్తు అనగా చివరి క్రీస్తు లేదా క్రీస్తు విరోధి అనే అర్థంతో వాడటం జరుగుతున్నది. అతి త్వరలో ఈ భూ ప్రపంచంమీద సాతాను రాజ్యం రాబోతున్నదని క్రైస్తవ మత గ్రంధాలు తెలియజేస్తున్నాయి. అంతేకాకుండా కొన్ని హైందవ మత గ్రంధాలు కూడా కలి పురుషునియొక్క నిజమైన పరిపాలన ప్రారంభం కాబోతున్నదని తెలియజేస్తున్నాయి.

సాతాను పరిపాలనలో ఈ భూమిపైన మానవత్వం, ధర్మం లాంటి మాటలకు అర్థం ఉండదు. బలహీనుడిని, బలవంతుడు పీడించే రాక్షస రాజ్యం భూమిపై స్థాపించ బడుతుంది. ఇప్పటికే ప్రపంచం మొత్తంమీద సాతాను పరిపాలన చాలావరకు మొదలైంది. దేవుడు అవతరించిన ప్రాంతమని చెప్పబడే భారతదేశంలోకూడా ఈనాడు అన్ని రకాలుగా అరాచకాలు తాండవిస్తున్నాయి. బలహీనుడికి బతికే హక్కులేకుండా పోతున్నది. కేవలం దౌర్జన్యాన్ని, అవకాశ వాదాన్ని పాటించే వారికి మాత్రమే ఈ సమాజంలో ఉన్నతస్థాయి లభిస్తున్నది. స్త్రీ, పురుషులలో నైతిక విలువలు పూర్తిగా నశించి పోయాయి. డబ్బు, అధికారం, పరపతి ఈ మూడూ ఉన్నవాళ్ళు ఎంత అరాచకంచేసినా ఏ విధమైన శిక్షలు వాళ్ళకు పడవు. బలం ఉన్నవాడిదే రాజ్యం అనే పరిస్థితి ఈనాడు ప్రపంచం మొత్తంమీద ప్రబలంగా ఉన్నది.


సాతాను (Satan)

ఇక భారతదేశం విషయానికి వస్తే సత్యయుగం, త్రేతాయుగం అనే రెండు యుగాలలో ధర్మం నాలుగు పాదాలతో నడిచింది. ద్వాపరయుగంలో ధర్మం రెండు పాదాలతోనే నడిచింది ఆ కారణంగానే మహాభారతంలో ఎన్నో అకృత్యాలు జరిగాయి. కపట జూదంతో పాండవులరాజ్యం అపహరించటమే కాకుండా వారి ధర్మపత్ని ద్రౌపదిదేవి ధరించిన వస్త్రాన్ని కూడా అపహరించాలని చూసారు కౌరవులు. ద్వాపరయుగంలో ఎన్నోరకాల అక్రమాలకు, అకృత్యాలకు

శ్రీకారం చుట్టబడింది. అందుకు కారణం ద్వాపరయుగానికి అధిపతియైన ద్వాపరుడు ఒక దుష్టశక్తి. ఆ ద్వాపరుడు ఈభూమిపై సామూహిక జనహననాకి మరియు అనేక అకృత్యాలకు మూలకారణంగా నిలిచాడు.

ఈ ద్వాపరుడు ఆ యుగంలోని ప్రజల మనస్సులను కలుషితంచేసి ప్రజలు పరకాంతని, పరధనాన్ని కోరుకొనే హీనులుగా తయారు చేసాడు. అంతేకాకుండా ద్వాపరుడు, శకునిగా జన్మించి కౌరవ పాండవులకు మధ్య తీవ్రమైన విద్వేషాలను రగిలించి చివరకు ఉభయపక్షాలవారు కురుక్షేత్ర యుద్ధంలోదిగి కోట్లాది సైనికులను నష్టపోయేలా చేసాడు. ప్రతియుగంలోనూ ధర్మానికి మరియు అధర్మానికి పోరాటం జరుగుతూనే ఉంటుంది. ఆయుద్ధంలో అంతిమంగా ధర్మం అనగా దేవుడు గెలవటం జరుగుతుంది. అధర్మం ఎన్నిసార్లు ఓడిపోయినా విసుగుచెందకుండా మళ్ళీ మళ్ళీ ధర్మాన్ని ఓడించాలని విఫల ప్రయత్నం చేస్తూ ఉంటుంది.

ఇది కలియుగం ఈ కలియుగానికి అధిపతి కలిపురుషుడు. పాశ్చాత్యులు వర్ణించే సాతాను మరియు భారత హైందవులు చెప్పే కలిపురుషుడు ఒక్కరే అన్నవిషయం గ్రహించాలి. పాశ్చాత్యుల పవిత్ర గ్రంథం బైబిల్ ప్రకారం ఒకప్పుడు దేవుడి (యెహోవా) యొక్క ప్రధాన అనుచరుడుగా ఉన్న లూసీఫర్ అనే ఒక ద్వితీయస్థాయి దేవుడు కాలక్రమంలో తాను దేవుడితో సమానుడిని అని గర్వపడటం ప్రారంభించాడు. అంతేకాకుండా ఒకరోజున దైవాన్ని ధిక్కరించి నేనే దేవుడిని అని ప్రకటించాడు. ఎప్పుడైతే లూసీఫర్ దైవాన్ని ధిక్కరించి దైవ ఆగ్రహానికి గురి అయ్యాడో ఆక్షణమే దైవం, లూసీఫర్‌ని వెయ్యి సంవత్సరాలపాటు పాతాళలోకంలో ఉన్న అగ్ని కీలలలో దహించుకు పొమ్మని శపించాడు. ఆవెంటనే లూసీఫర్ స్వర్గంనుండి నరకానికి గెంటివేయబడ్డాడు. అక్కడ వెయ్యి సంవత్సరాలు శిక్ష అనుభవించిన లూసీఫర్ పూర్తిగా దైవ విరోధిగా మారిపోయాడు.

ఈ భూప్రపంచంమీద దేవుడికి పూజలు జరగరాదని దేవుడికి ఇష్టమైన ధర్మం, న్యాయం అనే గుణాలు నశించిపోవాలన్న ఏకైక లక్ష్యంతో లూసీఫర్ ఈ భూమిపై అడుగుపెట్టాడు. ఆక్షణంనుండి లూసీఫర్ పేరు సాతానుగా మారింది. ఈ సాతానుకే డెవిల్ (దయ్యం), కలిపురుషుడు లాంటి వివిధపేర్లు ఏర్పడ్డాయి. ఈనాడు ప్రపంచ వ్యాప్తంగా సైతాన్‌ని పూజించే మానవులు అత్యధిక సంఖ్యలో ఉన్నారన్నమాట పచ్చినిజం. ఎవరైతే జీవితంలో పైకిరావాలని ఎంత కృషిచేసినా వృద్ధిలోకి రారో అట్టివారు సాతానుని శరణు కోరుతున్నారు.

ఆశ్చర్యకరంగా సాతాను వాళ్ళుకోరే కోర్కెలని చాలా తొందరగా నెరవేరుస్తున్నాడు. అమెరికా, జర్మనీ, ఇంగ్లండు, ఫ్రాన్స్ లాంటి అనేక పాశ్చాత్య దేశాలలో సాతాను ఆరాధన నానాటికి అధికమవుతున్నది. సాతాన్‌ని పూజించేవాళ్ళు కొన్ని వికృతమైన ఆచారాలను పాటించటం జరుగుతుంది.

మైకేల్‌జాక్సన్, సాతాన్‌ని ఆరాధించటం వల్లే ప్రపంచ వ్యాప్తంగా అంత గొప్ప పేరుని పొందగలిగాడని కొంతమంది విశ్వసిస్తున్నారు. పాశ్చాత్య దేశాల్లో మైకేల్‌జాక్సన్‌లాగా ఆడి పాడగలిగే పాప్ గాయకులు ఎందరో ఉండగా కేవలం మైకేల్‌జాక్సన్ మాత్రమే ఎందుకు ఎదురులేని పాప్‌గాయకుడు కాగలిగాడు ? ఇంకా అమెరికా అధ్యక్షులుగా పనిచేసిన బిల్‌క్లింటన్, జార్జిబుష్, మరియు ప్రస్తుత అధ్యక్షుడిగా పనిచేస్తున్న బరక్‌ఒబామా కూడా సైతాన్‌ని పూజించటమేకాకుండా సైతాన్ ముద్రని బహిరంగంగా ప్రదర్శించటం జరిగింది. ప్రస్తుత అమెరికా అధ్యక్షుడైన బరక్ ఒబామా తాను సాతాన్ భక్తుడిని అని నిరూపించటానికి గుర్తుగా సాతాను ముద్రని ఎలా ప్రదర్శిస్తున్నాడో పరిశీలించండి.



**సైతాన్ ముద్రను ప్రదర్శిస్తున్న అమెరికా అధ్యక్షుడు బరక్ ఒబామా**

సాతాను తనను ప్రార్థిస్తున్న వాళ్ళుకోరిన కోర్కెలని వెంటనే తీరుస్తున్నాడు. కొన్నాళ్ళకు ఈ భూ ప్రపంచంపై దైవం అనే మాట పూర్తిగా చెరిగిపోవాలని తానే ఈ ప్రపంచాన్ని ఏకఛత్రాధిపత్యంగా ఏలాలని సాతాను ప్రయత్నిస్తున్నాడు. ఈనాడు సాతాను ప్రభావం భారతదేశంలోకూడా ప్రముఖంగా కనిపిస్తున్నది.

ప్రపంచంలోని హైందవులు ఎంతగానో ఆరాధించే తిరుమల క్షేత్రంలో జరుగుతున్న అరాచకాలు, అక్రమాలు మీడియా ద్వారా అందరికీ తెలుస్తూనే ఉన్నది. ఈనాడు అనేక దేవాలయాలకు, ధర్మసత్రాలకు నిర్వాహకులుగా ఉన్న వారిలో చాలామంది అనేక అక్రమాలకు పాల్పడుతున్నారు. అయినా అలాంటి వాళ్ళకి ఎలాంటి శిక్షా పడటంలేదు. కారణం ప్రస్తుతం దైవం మౌనం వహించి ఉన్నాడు. సైతాన్ చెలరేగిపోతున్నాడు. దోచుకో! దోచుకో! నరుకు! నరుకు! ఇదే సాతాను విధానం.

సాతాను దైవానికి పరమ విరోధిగా గుర్తించబడ్డాడు. దేవుడిని వీలైనంత వరకు అపవిత్ర పరచటం సైతాను లక్ష్యం. మంత్ర, తంత్ర, యంత్రాలతో శక్తివంతం చేయబడిన దైవ క్షేత్రాలలో సైతాను భక్తులుచేసే అపవిత్ర కార్యాలవల్ల ఆయా క్షేత్రాలలో వేంచేసియున్న దైవాలు మహత్యాన్ని కోల్పోయి కేవలము అలంకారాలు చేయించుకునే శిలావిగ్రహాలు మారిపోతాయి అన్నమాట యదార్థము.

ఈనాడు కొందరు కండబలం, ధనబలంతోనే అన్నీ సాధించగలుగు తున్నారు. చదువుకున్న వాళ్ళకి తాగటానికి గంజికూడా దొరకని స్థితి. చదువు, సంధ్య, నీతినియమాలు లేకపోయినా కేవలం డబ్బున్నంతమాత్రాన అన్నిరకాల గౌరవాలను పొందేకాలం ఇది. సాతానుబలం పెరిగికొద్ది మనుషులు అమానుషంగా ప్రవర్తించడం జరుగుతున్నది. జాగ్రత్తగా పరిశీలిస్తే ఈనాడు శృంగార కార్యకలాపాలలో పాల్గొంటున్న స్వామీజీలు, పసిపిల్లలనుండి వృద్ధు రాళ్ళనికూడా వదలకుండా అత్యాచారాలు చేస్తున్న కిరాతకులు, బలము ఉన్నవాడిదే రాజ్యం అని పెట్రేగిపోతున్న అరాచకవాదులు మనకు అడుగడుగునా కనిపిస్తారు. ఇలా దుర్మార్గాలు చేసే వాళ్ళందరూ సైతాను భక్తులు కావలసిన పనిలేదు. కానీ సైతాను వాళ్ళపై ప్రభావాన్నిచూపి వాళ్ళు అనేక పాపకార్యాలు చేసేటట్టుగా పురికొలుపుతున్నాడు.

సాతానును తమ దైవంగా భావించి మనస్ఫూర్తిగా కొలిచినవాళ్ళకు సాతాను ఎన్నో దిగ్భ్రాంతి కరమైన విజయాలను అందిస్తాడని సాతాను భక్తులు బలంగా విశ్వసిస్తున్నారు. ఇక్కడ ఒక మతపరమైన విషయాన్ని మనం పరిశీలించవలసి ఉంటుంది. క్రైస్తవ మతంలో విగ్రహారాధన నిషిద్ధం. మంత్ర, తంత్రాలు అన్నమాటే అక్కడ వినపడరాదు. ఇంగ్లండులో క్యాథలిక్ క్రిస్టియన్

మతం పాటించబడుచుండగా అమెరికాలో పొటెస్టంట్ క్రైస్తవమతం పాటించబడుచున్నది. మంత్రవాదం (Freemasonry) ఆధారంగా సాతానుని ఆహ్వానిస్తారు మాంత్రికులు. ఈభూమిమీద దేవుడికి ఎలాంటి పూజలు జరగరాదని తను మాత్రమే ఈలోకాన్ని ఏకఛత్రాధిపత్యంగా వెలగాలన్నదే సాతాను ఏకైక లక్ష్యం. జర్మన్ల ప్రపంచ సామ్రాజ్యాన్ని సాధించాలని కలలుగన్న అడల్ఫ్ హిట్లర్ సాతాను సహకారంతోనే రెండవ ప్రపంచ యుద్ధంలో ఆనాటి అమెరికా, ఇంగ్లండ్, ఫ్రాన్స్ మరియు రష్యా లాంటి ప్రబలమైన దేశాలని గడగడలాడించాడని చాలామందికి తెలియదు. అలాగే ప్రపంచమంతటా కమ్యూనిజాన్ని బలప్రయోగంద్వారా వ్యాపింపచేసి తద్వారా తన నియంతృత్వాన్ని నిలబెట్టు కోవాలని ప్రయత్నించిన సోవియట్‌రష్యా మాజీ నియంత జోసెఫ్‌స్టాలిన్ రహస్య సాతాను ఉపాసకుడని ఎవరికి తెలుసు?

సాతానుని ఎందుకు పూజిస్తున్నారు? అని సాతాను భక్తుల్ని అడిగితే వాళ్ళు చెప్పే సమాధానాలు ఇలా ఉన్నాయి.

1. దేవుని రాజ్యంలో బలవంతులకి మాత్రమే అన్నీ దక్కుతాయి. మరి బలహీనుల్ని ఎవరు కాపాడుతారు.

2. భరించలేని రోగాలను మించిన పీడలాంటి పేదరికాన్ని భరిస్తున్న కోట్లాది మందికి తాగటానికి తిండి లేకపోతేపోయే కనీసం నీళ్ళయినా ఇవ్వని దేవుడు మంచివాడా.

3. ఎవరైనా ప్రాణంపోయే పరిస్థితులలో ఉండి ప్రార్థిస్తే ఆదేవుడు వచ్చి ఎవరినైనా కాపాటినట్టు దాఖలాలు ఉన్నాయా?

4. అతికొద్దిమందిని అదృష్టవంతులుగాచేసి అధికసంఖ్యాకులను దరిద్రులుగా మార్చేవాడు సమన్యాయం కలవాడా?

5. దేవుడు పెట్టే నియమాలు అర్ధరహితం.

ఒకవిధంగా చెప్పాలంటే బాధలలో ఉన్నవాళ్ళని రక్షించడానికి భగవంతుడు తాత్సారంచేస్తాడు. మీనమేషాలు లెక్కేస్తాడు ఈలోపల బలహీనులు బలి అయిపోతారు. దేవుడు పిలవగానే పలికితేనే ఆయనకి విలువ. ఈనాడు అనేక హిందూదేవాలయాల ఆస్తుల్ని నాస్తికులు (వీళ్ళు నుదిటిమీద దైవసంబంధమైన నిలువు బొట్టో లేదా అడ్డ బొట్టో లేదా కొంచం కుంకుమో పెట్టుకొని తెల్లటి బట్టలు ధరించి నీతి సూక్తులు వల్లిస్తూ మీడియా ముందు

వగలుపోతారు) ఎంతదారుణంగా కొల్లగొట్టినా ఆఖరికి అమ్మవారి మెడలో మంగళసూత్రం తీసుకుని తాకట్టుపెట్టుకున్నా ఆ దేవుడు ఏమీమాట్లాడడు. తనసొమ్మునే రక్షించుకోలేని దేవుడు తన భక్తుల్ని ఏమిరక్షిస్తాడు?. క్రైస్తవులకు పరమపవిత్రమైన బైబిలు గ్రంథంలో జోబ్అనే ధర్మవంతుడైన దైవభక్తుడు ఉంటాడు. దేవుడు ఆభక్తుడికి అనేక రకాల పరీక్షలుపెట్టి శోధిస్తాడు. ఎన్నికష్టాలు పడినా ధర్మం తప్పని జోబ్‌ని చివరికి దైవం కరుణిస్తాడు. అంటే హిందూ దేవుడైనా, క్రైస్తవదేవుడైనా కష్టాల్లో ఉన్నవాళ్ళని వెంటనే కాపాడడు అన్నమాట ఖాయం. అనేక కారణాలవల్ల దేవుడితో విసిగిపోయిన కొంతమంది ఆవేశపరులు సైతాన్ పక్షంలోచేరి సైతాన్ సహకారంతో వాళ్ళుకోరినవి సాధించుకున్నారు. వాళ్ళ అనుభవాలు విన్న కొత్తవాళ్ళు సైతాన్‌ను నమ్ముకుంటే వెంటనే మేలు జరుగుతున్న అభిప్రాయంతో సైతాన్ ఉపాసకులుగా మారిపోతున్నారు.

సాతాను మహామేధావి. ఎవరైనా మానవుడు దేవుడిని ధిక్కరించి తన పక్షంలో చేరితే వాడుకోరే కీర్తి, కాంత, కనకాలను క్షణాలలో అందిస్తాడు. సాతాను ఎవరికైనాసరే ఏడు సంవత్సరాలపాటు మేలుచేసి ఆతరువాత వాళ్ళని దుర్మరణంపాలుచేసి వాళ్ళ ఆత్మల్ని తన స్వాధీనంలోకి తీసుకుని ఆ ఆత్మలు సహకారంతో దేవుడిపై తిరుగుబాటుని కొనసాగిస్తాడు. అంటే సాతాను ఎవరికైనా ఏదైనా ఇస్తే మళ్ళీ అంతకు పదిరెట్లు వెనక్కులాక్కుంటాడు అన్నమాట. సైతాన్ మేలుచేసినా చివరలో కీడుచేస్తాడు అని తెలిసినా అనేకమంది ప్రజలు ప్రపంచవ్యాప్తంగా సైతాన్‌భక్తులుగా ఎందుకు మారుతున్నారు?. పరాజయాలతో లేదా పేదరికంతో, పరాభవాలతో విసిగిపోయిన మానవులు కొన్నేళ్ళపాటయినా ఉన్నతస్థాయిలో ఉండి సౌఖ్యాలు అనుభవించాలని లేదా బలవంతులైన తమ శత్రువులను మట్టుపెట్టాలన్న ప్రతీకారభావంతో సైతాన్‌పంచన చేరుతున్నారని తెలుస్తున్నది. సైతాన్ ప్రత్యేకత ఏమిటంటే తనని మనస్ఫూర్తిగా ప్రార్థించే మానవుల్ని సైతాన్ ఏనాడూ విడిచిపెట్టడు. సహాయంచేస్తాడు. అంతేకాదు తన నమ్మినబంట్లుగా ఉండేవాళ్ళు ఎన్ని దుష్కార్యాలుచేసినా సాతాను వాళ్ళపై కోపగించడు సరికదా వాళ్ళని మెచ్చుకొని మరింత గొప్పవాళ్ళని చేస్తాడు. దయ్యం తన బిడ్డల్ని ఏనాడు మర్చిపోదు అన్నసామెత సాతాన్‌కి వర్తిస్తుందా?

అమెరికాదేశ అధ్యక్షుడిగా పనిచేసిన బెంజ్‌మెన్ ఫ్రాంక్లిన్ స్వయంగా మంత్రవేత్తే కాకుండా సైతాన్‌కి వీరభక్తుడిగా ఉండేవాడని తెలుస్తున్నది. క్రీ.శ. 1757లో అమెరికాదేశంలోని వర్జీనియాలో స్థాపించబడిన సైతాన్ సంబంధ

మంత్రవాద సంస్థలో అమెరికా అధ్యక్షుడిగా పనిచేసిన జార్జి వాషింగ్‌టన్ సభ్యుడన్నవిషయం ఎంతమందికి తెలుసు. ఈనాడు అమెరికన్ కాంగ్రెస్‌లోని (అమెరికన్ పార్లమెంట్) అనేకమంది శాసనసభ్యులు రహస్యంగా సైతాన్ ప్రార్థనలకు వెళ్ళివస్తున్నారన్నమాట నిజం. సాతాను భక్తులు బైబిలుకు పోటీగా సాతాను గ్రంథాన్ని రూపొందించుకుని అనుసరిస్తున్నారు. ఇంకో విచిత్రమైన విషయం ఏమిటంటే పాశ్చాత్యదేశంలోని సాతాను ఉపాసకులు ఒక్కసాతాను బొమ్మనే కాకుండా సూర్యుడు, పంచభుజి నక్షత్రం (Pentagram) లాంటి చిహ్నాలను కూడా పూజించడం జరుగుతుంది. అమెరికాలో అత్యున్నతస్థాయిలో ఉన్న కొంతమంది వ్యాపారస్థులు, రాజకీయ నాయకులు అమెరికా జాతీయజెండా, కరెన్సీ, ఆఖరికి అతిముఖ్యమైన ప్రభుత్వ భవనాల నిర్మాణంలో కూడా సైతాన్‌యొక్క చిహ్నాలను ప్రదర్శించడం జరుగుతున్నది. దైవాన్ని నమ్మి, సైతాన్‌ని అసహ్యించుకొనే దైవభక్తుల కళ్ళు కప్పటానికి సైతాన్ చిహ్నాలకి ఏదోఒక ముసుగువేసి ప్రదర్శిస్తున్నారు.

ఇంకొక ఆసక్తికరమైన విషయమేమిటంటే అమెరికా రక్షణశాఖ ప్రధాన కార్యాలయమైన పెంటగాన్, సైతాన్ చిహ్నమైన పంచభుజి నక్షత్రం ఆకారంలో నిర్మించబడటం కాకతాళీయమా? అమెరికా జాతీయపతాకంలో ఉండే నాలుగు రంగుల్లో మూడు రంగులు అనగా కాషాయం, తెలుపు, నీలం మూడు రంగులు సైతాన్‌కి సంబంధించిన మంత్రవాదానికి చెందినవికావటం యాదృచ్ఛికమా?



**సాతాను ముద్ర**

అమెరికా సంయుక్తరాష్ట్రాల జాతీయ చిహ్నమైన గద్ద (Eagle) ప్రాచీనకాలంలో లూసీఫర్‌కి చెందినదికాదని ఎవరైనా అనగలరా? జార్జివాషింగ్‌టన్ మన్రో, గారిఫీల్డ్, రూజ్‌వెల్ట్ లాంటి అమెరికా అధ్యక్షులు, సాతానుకి రహస్య భక్తులుగా ఉండేవాళ్ళు. సాతానును పూజించే వాళ్ళు త్రిభుజాలతో నిర్మించబడిన ఒక ప్రత్యేక చిహ్నాన్ని పూజిస్తారు. వారి అభిప్రాయం ప్రకారం తల్లక్రిందులుగా ఉన్న త్రికోణం యోనిని సూచిస్తుంది. పైవైపు తిరిగిఉండే త్రిభుజం పురుషుని అంగానికి (Pennis) ప్రతీకగా భావించబడుతున్నది. ఒక త్రిభుజంలోకి ఇంకొక త్రిభుజం పొడుచుకొని రావటం స్త్రీ, పురుషుల సంభోగానికి చిహ్నంగా భావించబడుతున్నది. ఈ చిహ్నానికి

అపారమైన శక్తులు ఉంటాయని పాశ్చాత్య తంత్రవాదులు విశ్వసిస్తున్నారు. ఈ రెండు త్రికోణాలు పరస్పరం వ్యతిరేక దిశలలో ఒకదానిలో ఒకటి ఇమిడి ఉంటే దాన్ని ఆరు బిందువులుగల శక్తిరూపంగా సాతాను భక్తులు భావించటం జరుగుతున్నది.




**హెక్సాగ్రామ్, పెంటాగ్రామ్**

సాతాన్ అనేక దేశాలలో ప్రాంతీయ వాదాల్ని, తీవ్రవాదాల్ని సృష్టించి ఆయా దేశాల్లో మారణహోమం సృష్టిస్తున్నాడు. ఇలాంటి అరాచకాలకు పాల్పడేవాళ్ళకు సాతాన్ అదృశ్యంగా సహాయంచేస్తున్నాడు కనుకనే అలాంటివాళ్ళు చెప్పేమాటల్ని ప్రజలు అమాయకంగా నమ్మి వాళ్ళలో వాళ్ళు కొట్టుకొని నాశనం అవుతున్నారు.

సాతాన్‌ని నమ్మే అతికొద్దిమంది ప్రముఖులు వహించిన పాత్రకారణంగానే అమెరికాలోని ప్రధాన అధికారక భవనాలకు అంతరిక్షంలో గ్రహాలు సంచరించే సమయం (ముహూర్తం) ఆధారంగా పునాదిరాళ్ళు వేయబడ్డాయని అంతేకాకుండా ఆయా ప్రభుత్వ భవనాలపై జ్యోతిష్యంలో చెప్పబడే మీనం, మేషం, వృషభం లాంటి జ్యోతిష రాశుల బొమ్మలు చిత్రించబడి ఉన్నాయని తెలుస్తున్నది. క్రీ.శ. 1793, సెప్టెంబర్ 18 ఉదయం సూర్యుడు కన్యారాశిలో 23డిగ్రీలలో ఉండగా, సరిగ్గా అదే సమయానికి చంద్రుడు మరియు రాహువు (dragon's head node) అదే కన్యారాశిలో, అదే డిగ్రీలపై ఉన్న ముహూర్తంలో అమెరికా అధ్యక్షభవనం అయిన శ్వేతసౌధం (White house)కి పునాదులు వేయబడ్డాయి. అమెరికా కాంగ్రెస్ లైబ్రరీకి పునాదివేసినపుడు సూర్యుడు,శని, కన్యారాశిలో ఉన్నారు. ఇంకో ఆసక్తికర విషయమేమిటంటే వాషింగ్‌టన్ డి.సి. నిర్మాణానికి ప్లానింగ్ ఇచ్చిన ఇంజనీర్లకు గ్రహ సంబంధమైన మరియు జ్యోతిష్య సంబంధమైన పరిజ్ఞానం ఉన్నదని తర్వాతికాలంలో ఋజువయ్యింది.

అమెరికాలోని ఫిలడెల్ఫియా రాష్ట్రంలో జూలై 4వతేదీన అమెరికా స్వతంత్ర ప్రకటనపై తొలి సంతకంపెట్టిన వ్యక్తి ఒక మంత్రవాది. అంతేకాకుండా సూర్యుడు సిరియస్ (Sirius) నక్షత్రంపై ఉండే సమయంలో అమెరికా స్వాతంత్ర ప్రకటన వచ్చింది.



**అమెరికా జాతీయ చిహ్నం - గ్రద్ద**

ప్రాచీనకాలంలో ఈజిప్టు దేశస్తులు సైతాన్‌ని పూజిస్తూ ఉండేవాళ్ళు. వాళ్ళు ఈ Sirius నక్షత్రాన్ని సైతాన్ చిహ్నంగా ఆరాధిస్తూ ఉండేవాళ్ళు. అమెరికా స్వాతంత్ర ప్రకటన సైతాన్ చిహ్నమైన ఈనక్షత్రంలో సూర్యుడు ఉన్న సమయంలోనే ప్రకటించటం కేవలం కాకతాళీయమా? అమెరికాలో విప్లవం వచ్చిన మరుసటి సంవత్సరం నుండి నిర్మించబడిన అనేక బ్రిడ్జిలు, హాస్పటల్స్, మ్యూజియంలు చివరికి చర్చిలనుకూడా గ్రహ గమనం ఆధారంగా నిర్మించడం జరిగింది. అమెరికాదేశంలో చలామణి అవుతున్న డాలర్‌నోటుపైన అమెరికాదేశంయొక్క గ్రేట్‌సీల్ తల్లక్రిందులుగా ముద్రించ పడివున్నది.

ఈనాడు ప్రపంచదేశాలలో ఒక్క అమెరికా మాత్రమే రెండువైపులా గ్రేట్‌సీల్ డాలర్‌పై ముద్రించిన దేశమని తెలుస్తుంది. ఇంకో విచిత్రమైన అంశం ఏమిటంటే ఈ గ్రేట్‌సీల్‌పైన మరియు డాలర్‌నోట్‌పైన లాటిన్ భాషలో ఉండే రెండు పదబంధాలు (Phrases) ముద్రించబడి ఉన్నాయి. అవి 1. Annuit Coeptus (ఈ పదానికి అర్థమేమిటంటే దేవుడు మన ప్రయత్నాలను ఫలింపచేయుగాక అని) 2. Novus Ordo Seclorum ఈ పదానికి అర్థం ఏమిటంటే The new order of ages అని గ్రహించాలి. అమెరికా రాజముద్ర అయిన గద్ద యొక్క ఒక కాలు, ఒక బాణాల కట్టని పట్టుకుని ఉన్నట్టుగా ఉంటుంది. అంటే దాని అర్థం అమెరికా నిర్మాతలకు యుద్ధప్రీతి ఉన్నట్టు.

సైతాన్‌కి ఇష్టమైన 13వ నెంబర్ అనేక అమెరికా జాతీయ చిహ్నాలలో కనిపిస్తూ ఉంటుంది. అమెరికా జాతీయ జెండాలో 13 నక్షత్రాలు, 13 చారలు, 13 బాణాలు అమెరికా రాజ చిహ్నమైన గద్దయొక్క ఒక కాలిక్రింద ఉన్న ఆలివ్‌కొమ్మకు 13 ఉన్నాయి. రెమ్మలు ఉన్నట్టుగా తెలుస్తున్నది.

అమెరికాకు బ్రిటన్‌నుండి స్వాతంత్ర్యం వచ్చినపుడు, అమెరికాలో ఉన్న రాష్ట్రాలు 13, ఆతరువాతకాలంలో వేర్వేరుగాఉన్న మిగిలిన 37 రాష్ట్రాలను అమెరికాలో కలపటం జరిగింది. అమెరికా స్వతంత్ర సంగ్రామానికి నాయకత్వం వహించి బ్రిటీషువారిని ఓడించి ఆపై అమెరికాదేశానికి ప్రధమ అధ్యక్షుడు అయిన జార్జివాషింగ్‌టన్ సైతాన్ సహకారంతో యుద్ధంలో విజయం సాధించాడని తెలుస్తున్నది. వాషింగ్‌టన్ యుద్ధంలో చాలా శక్తివంతమైన యుద్ధ వ్యూహాల్ని పన్నుతూ ఉండేవాడు. అంతేకాకుండా ఏరోజుకారోజు యుద్ధంలో ఏమిజరగబోతుందో ఎంతమంది సైనికులు చావబోతున్నారో తన సహాయ సేనాధిపతికి ముందుగానే జోస్యం చెబుతూ ఉండేవాడు. ఆశ్చర్యకరంగా వాషింగ్‌టన్ చెప్పినట్టే జరిగేది. నీకు జరగబోయేవి ముందుగానే ఎలా తెలుస్తున్నాయి? అని అతని సహాయకుడు అడిగితే నాకు పైనవుండే అధిష్టానంనుండి అన్నీ తెలుస్తున్నాయి. అనిచెప్పేవాడేతప్ప తనకు సాతానే అన్నీ తెలియజేస్తున్నాడు అన్న విషయం పొరపాటునకూడా బయటపెట్టేవాడు కాదు.

సాతాను రావటానికి ముందు నరకలోకంలోని (పాతాళం) క్రూరమృగం భూమి మీదకు వస్తుంది. ఆ క్రూరమృగం సాతానుకి ప్రతినిధిగా ఉండి ఈ భూమిపైన దైవాన్ని ఆరాధించే వాళ్ళను సంపూర్తిగా నిర్మూలించి సాతాను ఆరాధకులను ప్రోత్సహిస్తుంది. ఈ క్రూర మృగాన్ని ఇంగ్లీషులో 'బీస్ట్' (Beast) అని పిలుస్తారు. ఈ మృగం యొక్క సంఖ్య 666. క్రీ.శ. 2011 జనవరి 14వ తేదీనుండి ఈ భూమిపై సైతాను ప్రతినిధిగా చెప్పబడుతున్న మృగం (Beast) యొక్క పరిపాలన ప్రారంభం కాబోతున్నది.

ఆ రోజునుండి భారతదేశంతో సహా ప్రపంచం అంతటా గంటకు ఒక కుంభకోణం, రెండుగంటలకు ఒక హత్య, మూడుగంటలకు ఒక మానభంగం, నాలుగు గంటలకు ఒక ప్రమాదం, అయిదుగంటలకు ఒక ఆశ్చర్యకర సంఘటన, ఆరుగంటలకుఒక దోపిడి జరిగే వికృతమైనకాలం ప్రారంభం అవుతుంది. ఆపై 7సం॥రాలపాటు అనగా 2018 జనవరి 14వ తేదీవరకు ఈ క్రూరమృగంయొక్క పరిపాలన సాగుతుంది. దైవ క్షేత్రాలలో వందలాది భక్తులు దుర్మరణంపాలు అవుతూ ఉంటారు. తిరుమలస్థాయి వీధగుడిస్థాయికి చేరుతుంది.



Fig. **Beast**

ఈ ఏడుసంవత్సరాల సైతాను ప్రతినిధి (Beast) పరిపాలనాకాలంలో తరచుగా ప్రభుత్వాలు పడిపోవటం, కొత్తకొత్త రాష్ట్రాలు ఏర్పడటం, పెద్దపెద్ద నాయకులు హత్యలకు గురి కావటం, ఆకస్మికంగా భూకంపాలు, వరదలు రావటం జరుగుతుంది. ఈ క్రూరమృగం పరిపాలనా కాలంలో ఎవరికీ మనశ్శాంతికానీ, రక్షణకానీ ఉండదు. ఎవ్వరూ తాము అనుకున్న కార్యక్రమాలను అనుకున్న విధంగా పూర్తిచేయలేరు దినమొక గండంగా గడుస్తుంది.

## 14. కుంభమేళా అంటే ఏమిటి?

అమృతంకోసం దేవదానవులు పాలసముద్రాన్ని మంధరపర్వతాన్ని కవ్వంగా మహాసర్పమైన వాసుకిని కవ్వపు తాడులాగా అమర్చి చిలకటం జరిగింది. అలా పాలసముద్రాన్ని చిలుకుతున్నప్పుడు మొదట చంద్రుడు, లక్ష్మీదేవి, కల్పవృక్షం, కామధేనువు, ఐరావతం లాంటి అద్భుతమైన శక్తులు బయటకి వచ్చాయి. ఆ తరువాత పాల సముద్రంనుండి మూడు లోకాలను అంతంచేయగల కాలకూట విషం బయటకు వచ్చింది. ఆ విషాన్ని లోక క్షేమంకోసం మహేశ్వరుడు తన గొంతులో పెట్టుకుని ప్రజల్ని రక్షించాడు. కంఠప్రాంతంలో నీలంరంగులో ఉండే విషాన్ని ఉంచుకున్నాడు కనుక ఆనాటి నుండి శివునికి నీలకంఠుడు, గరళకంఠుడు అనేపేర్లు వచ్చాయి. ఆ తరువాత

అమృతం పుట్టింది. మరణంలేకుండాచేసే ఆ అమృతం రాక్షసులచేతులో పడితే ఇక వారికి చావు అనేదే ఉండదు. తత్ఫలితంగా రాక్షసులు విజృభించి సమస్త లోకాలను నాశనంచేస్తారు.

ఆ ప్రమాదాన్ని నివారించటానికి శ్రీమహావిష్ణువు మోహినీ అవతారాన్ని ధరించి అమృతం ఉన్న కుండని తీసుకుని ప్రపంచం అంతటా తిరిగాడు. ఆ సమయంలో దేవ దానవులు అమృతంకోసం జగన్మోహినిని అన్ని ప్రాంతాలకు అనుసరించటం జరిగింది. శ్రీమహావిష్ణువు, మాయామోహినీ రూపంలో అమృత భాండాన్ని తీసుకుని ప్రపంచంలో సంచరిస్తున్నప్పుడు ఆ అమృత భాండం నుండి కొన్ని అమృతం చుక్కలు ఒక్కొక్క ప్రదేశంలో ఒక చుక్క చొప్పున నాలుగు ప్రదేశాలలో పడ్డాయి. తత్ఫలితంగా ఆ నాలుగు ప్రదేశాలకు ఎంతో పవిత్రత వచ్చింది. ఆ నాలుగు ప్రదేశాలు ఏవి అంటే ప్రయాగ్ (గంగ), హరిద్వార్, ఉజ్జయిని మరియు నాసిక్ (గోదావరి). ఈ నాలుగు ప్రదేశాలలో ప్రతి 12సం॥రాలకు ఒకసారి కుంభమేళా జరుగుతుంది. ఈ కుంభమేళా జరిగినపుడు నదిలో స్నానం చెయ్యటానికి ఒక్కరోజులో దాదాపు కోటి మంది యాత్రికులు అక్కడికి రావటం జరుగుతుంది. అత్యంత పవిత్రమైన ఈ కుంభమేళాకు అఘోరాలు, నాగసాధువులు, కాపాలికులు రావటం జరుగుతుంది. ఇంకొక అద్భుతమైన విషయం ఏమిటంటే ఈ కుంభమేళాకు మహాఅవతార్ బాబాజీ మరియు హిమాలయ పర్వతాలలో నిరంతరం తపస్సులో ఉండే ఇతర సిద్ధ యోగులు కూడా వస్తారని కొందరు పండితులు తెలియజేస్తున్నారు. క్రీ.శ. 6వ శతాబ్దంలో కూడా కుంభమేళా జరిగినట్టుగా ఆనాడు భారతదేశాన్ని సందర్శించిన యువాన్‌చంగ్ అనే చైనా యాత్రికుడు తన గ్రంధాలలో వ్రాయటం జరిగింది.

భారతీయ జ్యోతిషశాస్త్ర ప్రకారం బృహస్పతి (గురు గ్రహం) కుంభరాశిలోకి ప్రవేశించినపుడు కుంభమేళా ప్రారంభం అవుతుంది. కుంభమేళా జరిగే నాలుగు ప్రదేశాలలోనూ కేవలము గురువు కుంభరాశిలోకి ప్రవేశించటమే కాకుండా ఖగోళంలో సూర్యుడు, చంద్రుడు అనే రెండు గ్రహాలుకూడా ఏయే రాశులలో ఉన్నాయి అన్న విషయంకూడా లెక్కలోకి తీసుకోబడుతుంది.

కుంభం అంటే కుండ అని అర్థం. జ్యోతిషంలో కుంభరాశి చిహ్నం కుండ అన్నవిషయం అందరికీ తెలుసు. ఆ కుంభరాశిలోకి గురువు ప్రవేశించినపుడు కుంభమేళా ప్రారంభం అవుతుంది.

పూర్ణకుంభమేళా ప్రతి 12 సంవత్సరాలకు ఒకసారి 1. ప్రయాగ (అలహాబాద్) 2. హరిద్వార్ 3. ఉజ్జయిని 4. నాసిక్ అనే ప్రదేశాలలో జరుగుతుంది.

అర్ధ కుంభమేళా ప్రతి 6 సంవత్సరాలకు హరిద్వార్ మరియు ప్రయాగలలో జరుపబడుతుంది.



**కుంభమేళా స్నానాలకు వచ్చిన నగ్న అఘోరాలు**

మహాకుంభమేళా ప్రతి 140 సంవత్సరాలకు ఒకసారి అలహాబాద్‌లో జరుపబడుతుంది. 2001వ సంవత్సరంలో అలహాబాద్‌లో జరిగిన మహా కుంభమేళాకు 60 మిలియన్ల యాత్రికులు పవిత్ర స్నానాలు చెయ్యటానికి రావటం జరిగింది. ఇంతవరకు ప్రపంచస్థాయిలో ఇంత పెద్ద సంఖ్యలో ప్రజలు ఒకే చోటుకి చేరటం ఈ 2001లో జరిగిన కుంభమేళాలో మాత్రమే జరిగిందని తెలుస్తున్నది. ఈ కుంభమేళా దాదాపు ఒక నెలరోజులపాటు ప్రతి క్షేత్రంలోనూ (ప్రయాగ్, హరిద్వార్, నాసిక్, ఉజ్జయిని) జరుప బడుతుంది. ఈ సందర్భంలో అనేకమంది మహా పండితులు, మహా సాధువులు ఈ కుంభమేళాకు హాజరు కావటం జరుగుతుంది. ఆ సమయంలో పేద ప్రజలకు విరివిగా అన్నదానాలు చెయ్యబడతాయి. ఈ కుంభమేళాకు వచ్చే వివిధ రకాల వేదాంత, తంత్రశాస్త్రాలకు సంబంధించిన పండితులు ఇక్కడ పండిత సభలు జరుపుతారు. కేవలం భారతదేశం నాలుగు మూలలనుండే కాకుండా పాశ్చాత్య దేశాల నుండికూడా కుంభమేళాను దర్శించటానికి యాత్రికులు రావటం జరుగుతుంది.

వైశాఖమాసంలో కుంభమేళాలో ఒక్కసారి నదీస్నానం చెయ్యటం వల్ల వెయ్యిసార్లు కార్తీక స్నానాలు, 100సార్లు మాఘమాస స్నానాలు మరియు కోటిసార్లు నర్మదానదీస్నానాలు చేసినంత ఫలితం లభిస్తుందని హైందవ ధర్మశాస్త్రాలు తెలియ జేస్తున్నాయి.

**అమావాస్య:**

చంద్రమాసం (Lunar month) లో, కృష్ణపక్షంలో వచ్చే చివరిరోజునే అమావాస్య అని పిలుస్తారు. ఆరోజున ఆకాశంలో చంద్రుడు కనిపించడు. చాలామంది అమావాస్యను చెడుసమయంగా భావించటం జరుగుతుంది. కానీ ఆరోజున హిందువులు కొన్ని ప్రత్యేకమైన, మరియు మతపరమైన కార్యక్రమాలను నిర్వహించుకోవటం మంచిది. హైందవ ధర్మశాస్త్రాలప్రకారం అమావాస్య ఘడియలలలో ఇతర లోకాలలో ఉన్న చనిపోయిన వారియొక్క ఆత్మలు భూలోకానికి వస్తాయని అలా క్రిందికి వచ్చే ఆత్మలకు ఆకలి మరియు దాహం అపరిమితంగా ఉంటాయని తెలుస్తున్నది. అలా అమావాస్య ఘడియలలో భూమిపైకి వచ్చే చనిపోయిన వారియొక్క ఆత్మలకు, వారి వారసులు తర్పణాలను వదలటం జరుగుతుంది. ఆ తర్పణాల ఫలితంగా చనిపోయినవారి ఆత్మలకు ఆకలి, దాహంతీరి సంతృప్తిగా మరల తమ తమ లోకాలకు వెళ్ళిపోతాయి.

మాఘమాసంలో (జనవరి–ఫిబ్రవరి) వచ్చే మౌని అమావాస్య, ఆశ్వీజమాసంలో (సెప్టెంబర్–అక్టోబర్) వచ్చే మహాలయ అమావాస్య దినములు హైందవమతంలో అత్యంత పుణ్య దినములుగా భావించబడుతున్నాయి. భారతదేశంలోని కొన్ని ప్రాంతాలలో నివసించే హిందువులు ఈ రెండు రోజులలో ఉపవాసం ఉండి తమ ఇష్టదైవాన్ని కొలవటం జరుగుతుంది. ఆదివారం–అమావాస్య– శుక్రవారం, అమావాస్య అనే వార, తిధి కలయిక సంధర్భాలలో దశమహావిద్యలలో ఒకటైన ఛిన్నమస్తాదేవిని పూజించటంవల్ల అనేక విధాలైన సమస్యలు తీరతాయని హైందవ తంత్రశాస్త్రం తెలియజేస్తున్నది.

# 15. వాస్తుశాస్త్రం నిజంగా మానవులపై ప్రభావాన్ని చూపుతుందా?

వాస్తుశాస్త్రాను సారంగా గృహ నిర్మాణం చేసుకుంటే సుఖంగా వుండవచ్చు. ఒక భవనం బలంగా ఉండాలంటే గోడలు ఎంతమందంగా ఉండాలి. పునాదులు ఎంత లోతుగా ఉండాలి. స్థంభాలు ఎంత లావుగా ఉండాలి. లాంటి అంశాలను ఖచ్చితంగా అంచనావేయాల్సి ఉంటుంది. అదేవిధంగా ఒక గృహం నిర్మించు కోవలనుకుంటున్న స్థలముయొక్క మరియు ఆస్థలము సరిహద్దులలో ఉన్న ఇతర నిర్మాణాలు మరియు వృక్షాలయొక్క ప్రభావాలను ముందుగానే తెలుసుకోవాల్సి ఉంటుంది. ఇలా సమస్త నిర్మాణ రహస్యాలను తెలియజేసే శాస్త్రమే వాస్తుశాస్త్రము. అతి ప్రాచీనకాలంలోనే భారతదేశానికి చెందిన వరాహమిహురుడు అనేపేరు గల ఖగోళశాస్త్రజ్ఞుడు గృహ నిర్మాణానికి సంబంధించిన విభిన్న అంశాలను గురించి ఒక మహాగ్రంథాన్ని వ్రాయటం జరిగింది.

ఆగ్రంథం పేరు బృహత్‌సంహిత. వరాహమిహురుడు గణిత, జ్యోతిష, తర్క మరియు ఖగోళశాస్త్రాలలో నిష్ణాతుడు అని తెలుస్తున్నది. గ్రహాలయొక్క ప్రభావం మానవులపై ఉంటుందని, అదేవిధంగా కట్టడాలపైకూడా గ్రహాల ప్రభావం ఉంటుందని ఆయన తెలియజేసాడు. ఇటీవల కాలంలో కొందరు సైన్స్ ఉన్మాదం తలకెక్కి వాస్తుశాస్త్రం అబద్ధమని వాదిస్తూ జనాల్ని తప్పుదోవ పట్టిస్తున్నారు. ఆకాశంలో ఉండే గ్రహాలను చూడటానికి ఏవిధమైన టెలిస్కోపులులేని ప్రాచీనకాలంలో గ్రహాలు భూమికి దగ్గరగా ఉన్నాయా దూరంగా ఉన్నాయా ఉంటే ఎంత దూరంలోఉన్నాయి లాంటి విశేషాలను ఆనాటి భారతీయ ఖగోళశాస్త్రజ్ఞుడైన వరాహమిహురుడు స్పష్టంగా తెలియజేసాడు. ఈనాటి శాస్త్రజ్ఞులుకూడా ఆనాడు వరాహమిహురుడు చెప్పిన ఖగోళశాస్త్ర అంశాలను సత్యమే అని అంగీకరిస్తున్నారు.

వరాహమిహురుడు గ్రహాలను అధ్యయనం చేయటంలో ఎంతో విశేషమైన ప్రతిభను చూపాడు. ఒకసారి వరాహమిహురుడు రాత్రి సమయంలో ఆరుబయట నేలమీద ఒకచాపను వేసుకుని దానిమీద పడుకుని ఆకాశంలోని తారలను, గ్రహాలను పరిశీలించటం మొదలుపెట్టాడు. ఇంతలో ఆయన దృష్టి అకస్మాత్తుగా

గురుగ్రహం మీద పడింది. నిన్నటికన్నా గురుగ్రహం ఈరోజు కొంచెం దగ్గరగా వచ్చినట్టుగా ఆయనకు అనిపించింది. ఇది ఎలా సాధ్యపడిందా అని ఆలోచిస్తూ చాపపైనుండి లేచి ఆచాపను చుట్టటం మొదలుపెట్టాడు. అప్పుడు ఆచాపక్రింద ఒక బొంతవేసి ఉన్నట్టుగా ఆయనకు తెలిసింది. అప్పుడు అర్థమయ్యింది అడుగున ఉన్న బొంతకారణంగా చాప ఎత్తు ఒక అంగుళం పెరిగింది. ఆ కారణంగా ఆచాపపై పడుకున్న వరాహమిహురుడు కూడా ఒక అంగుళం ఎత్తుమీద ఉన్నట్టుగా అయ్యింది. కనుక నిన్నరాత్రి కనిపించిన గురుగ్రహం ఈరోజురాత్రి అంగుళందూరం దగ్గరగా వచ్చినట్టయ్యింది. ఈ సంఘటన యదార్థంగా జరిగిందని గుర్తించాలి. తాను పడుకుని ఉన్నచాప ఎత్తు కేవలం ఒక్క అంగుళం పెరిగినంతమాత్రానే ఆకాశంలో కనిపించే గురుగ్రహం ఒక అంగుళం ముందుకు వచ్చినట్టుగా గుర్తించిన వరాహమిహురుడి మేధస్సుకు ఏ సూపర్ కంప్యూటర్లు సమానమవుతాయి!.

బృహత్సంహిత గ్రంథంలో గృహాలు నిర్మించే స్థలాలలో ఉత్తరము మరియు తూర్పు దిక్కులు ఖాళీగా ఉండాలని చెప్పబడింది. అందుకు కారణం ఏమంటే ఆ దిక్కులనుండి ఉదయ సమయాలలో సూర్యుని నుండి వచ్చే పాజిటివ్ కిరణాలు ఆస్థలంలో ఉన్న గృహంలోనూ, ఆ గృహంలో నివసించే వ్యక్తులపైపడి వారికి మేలుచేస్తాయి. ఆ కారణంగానే తూర్పువైపున స్నానాలగది (బాత్‌రూమ్) నిర్మించాలని చెప్పబడింది. తూర్పువైపున స్నానాలగది ఉన్నచో అందులో ఉదయంపూట స్నానంచేసే వారిపై సూర్యుని తాలూకు పాజిటివ్ ఎనర్జీపడి వారిని ఆరోగ్యవంతుల్ని చేయటం జరుగుతుంది.

బావులు లేదా నీటి పంపులు ఈశాన్యదిక్కులో ఉండాలని చెప్పటానికి గల కారణం ఏమిటంటే ఆగ్నేయంలో ఉన్న వంటగదిలో ఏమైనా అగ్ని ప్రమాదాలు జరిగి నపుడు ఆ దిక్కుకు దగ్గరగా ఉన్న ఈశాన్యంలోని నీటిని సులువుగా తీసుకుని అగ్నిని ఆర్పివేయవచ్చు. అగ్ని ప్రమాదాన్ని నివారించవచ్చు. నిద్రపోవటానికి కూడా వాస్తుశాస్త్రం ఒక సూత్రాన్ని చెప్పటం జరిగింది. అది ఏమిటంటే దక్షిణంవైపు తల ఉంచి నిద్రించాలి. అందుకు కారణం ఏమిటంటే మానవ శరీరంలోని రక్తంలో ఇనుప ధాతువు ఉంటుంది. ఈ ధాతువు రక్తంతోపాటు శరీరం అంతటా ప్రవహిస్తూ ఉంటుంది. మానవ శరీరంలోని పాదాల ప్రాంతంలో దక్షిణ ధృవం తాలూకు ఆకర్షణశక్తి మరియు తలలో ఉత్తర ధృవం తాలూకు ఆకర్షణశక్తి ఉండటం జరుగుతుంది. ఆ కారణంగా

మనిషి దక్షిణంవైపు (దక్షిణ ధృవం) తలపెట్టినపుడు అతని తలలోఉన్న ఉత్తర ధృవం ప్రేరేపితమై అతనిలో నిద్రపోతున్నప్పుడుకూడా రక్తప్రసరణ చక్కగా జరిగి ఆరోగ్యం బాగుంటుంది.

ఉత్తరంవైపు తలపెట్టి పడుకుంటే తలనొప్పి రావటం లేదా ఆరోగ్యం పాడయ్యే అవకాశాలు ఉన్నాయి. ఏ హాస్పిటల్స్‌లోని పేషెంట్లు దక్షిణ దిక్కువైపుగా తలను పెట్టుకునే విధంగా పడకల ఏర్పాటు ఉంటుందో ఆ ఆసుపత్రులలో చేరిన రోగులకు త్వరలోనే రోగ ఉపశమనం కలుగుతుంది. పిచ్చి ఆసుపత్రిలోకూడా మానసిక రోగులు దక్షిణంవైపు తలపెట్టి పడుకునే విధంగా ఏర్పాటుచేయటం జరుగుతుంది. అందువలన మానసిక రోగులకు త్వరలోనే పిచ్చితగ్గి ఆరోగ్యవంతులు అయ్యే అవకాశముంటుందని తెలుస్తున్నది.

ప్రతి మానవునిలోను ఒకవిధమైన ప్రాణశక్తి (vital force) ప్రవహిస్తూ ఉంటుంది. ఆ ప్రాణశక్తి కారణంగానే ప్రతిమనిషి శరీరంచుట్టూ ఒకవిధమైన అదృశ్య కాంతి వెలువడుతూ ఉంటుంది. అయితే ఆ కాంతి మామూలు మానవుల కళ్ళకి కనపడవు. క్లిరియన్ కెమెరాలు ఉపయోగించినపుడు మానవుల చుట్టూ ఉండే కాంతి వలయాలు (auras) కనిపిస్తాయి. వాస్తుశాస్త్రాన్ని చెప్పిన ప్రాచీన భారతీయులు పీటమీద కూర్చుని భోజనం చేయమని చెప్పిన కారణం ఏమిటంటే పీటమీద కూర్చోవటం వల్ల అతని ప్రక్కనే కూర్చుని భోజనంచేసే వ్యక్తికి కొంచం దూరంగా కూర్చోటానికి వీలవుతుంది. అలా కూర్చోవటంవల్ల పక్కవ్యక్తి నుండి వెలువడే కాంతి వలయాల వలన పీటమీద కూర్చున్న వ్యక్తి నుండి వెలువడే కాంతి వలయాలను తాకే అవకాశం ఉండదు. అందువలన పీటమీద కూర్చున్న వ్యక్తి చుట్టూ ఉండే "అరా" పక్కవ్యక్తి అరాతో భంగపరచ బడదు. కనుక పీటమీద కూర్చుని భోజనం చెయ్యటం వలన పక్క వ్యక్తి తాలూకు కాంతివలయం భోజనం చేస్తున్న వ్యక్తికి తగలదు. తత్ఫలితంగా పీటమీద కూర్చున్న వ్యక్తిలోని ప్రాణశక్తి సక్రమంగా ప్రవహిస్తూ ఆవ్యక్తి తీసుకున్న ఆహారాన్ని చక్కగా జీర్ణం అయ్యేలా చేస్తుంది. కనుక ఒకళ్ళమీద ఒకళ్ళు పడిపోతూ తీసుకునే ఆహారం ఆ యిద్దరికీ జీర్ణంకాదు. కనుక పీటవేసుకుని దానిమీద బాసిపెట్టి (Squate) లేదా పద్మాసనం వేసుకుని కూర్చుని భోజనం చేస్తే ఆ అన్నం ఒంటికి వంటపట్టి ఆరోగ్యాన్ని ఇస్తుంది.

భారతదేశంలో చాలామంది భారతీయులు ఎదుటివారిని పలకరించటానికి నమస్కారం అని రెండు చేతుల్ని జోడించి ఛాతివరకు తెచ్చుకుని

నమస్కరిస్తారు. చేతులు కలపరు. అనగా Shake hand ఇవ్వరు. ఇద్దరు వ్యక్తులు Shake hand ఇచ్చుకున్నప్పుడు ఇద్దరు వ్యక్తులలో ఉండే ప్రాణశక్తి కొంతవరకు వృథా అవుతుంది అని తెలుస్తున్నది.

ప్రతి స్థలము (Plot) చుట్టూ విశ్వ అయస్కాంత క్షేత్రము మరియు శక్తి ఆవరించి ఉంటుంది. ఈ శక్తి అనుకూలమైనది కావచ్చు. లేదా వ్యతిరేకమయినది కావచ్చు. ఒక స్థలంలో కేవలము అనుకూలమైన శక్తి ప్రవాహము ఉండేలా చెయ్యటం కోసం వాస్తు శాస్త్రం కొన్ని సూత్రాలను చెప్పటం జరిగింది. ఒక ఖాళీస్థలం చుట్టూ ప్రహరీగోడను నిర్మించినట్లయితే ఆప్రహరీగోడ ఆస్థలంలో విశ్వ అయిస్కాంత క్షేత్రములను మరియు శక్తిని ఒక స్థిరమైన స్థాయిలో ఉండేలా చేయటం జరుగుతుంది. స్థలం చుట్టూ ముఖ్యంగా పశ్చిమ మరియు దక్షిణ దిక్కుల్లో ప్రహరీగోడ ఉండితీరాలి.

స్థలము యొక్క ఆకారాన్ని బట్టికూడా ఆస్థలంలో ఉండే అయస్కాంత క్షేత్రం యొక్క ప్రభావాలు మారుతూ ఉంటాయి. ఒక స్థలం చతురస్రాకారాంలో ఉన్నట్లయితే ఆస్థలంలో విశ్వశక్తుల అనుకూల ప్రభావం ఉంటుంది. అదేవిధంగా ధీర్ఘచతురస్రాకార స్థలంలో శక్తుల యొక్కస్థాయి మధ్యమంగా ఉంటుంది. తూర్పు, ఉత్తరం మరియు ఈశాన్యం దిక్కులలో పూలు పూసే వృక్షాలను పెంచరాదు. అందుకు కారణం ఏమనగా ఆస్థలంలో ఉండే శు భకరమైన అయస్కాంత కిరణాలను ఆ చెట్లు లాక్కుంటాయి. ఆకారణంగా ఆస్థలంలో నిర్మించబడిన గృహానికి రావలసిన శుభ ఫలితాలు అందవు.

వాస్తుశాస్త్రం గ్రహముల చలనము మరియు వాటి ప్రభావాలపై ఆధారపడి రూపొందించబడినది. గ్రహాలయొక్క ప్రభావము కేవలము మానవులు మరియు జీవులపైనే కాకుండా భూమిపై ఉండే పర్వతాలు, సముద్రాలు, నదులు, స్థలాలపైకూడాఉంటుంది. చంద్రునియొక్క ఆకర్షణ మరియు వికర్షణశక్తి కారణంగా సముద్రాలలో ఆటు మరియు పోటు వస్తూ ఉంటాయి. ప్రతి స్థలమునకు 8 దిక్కులు ఉంటాయని తెలుసుకోవాలి అవి 1. తూర్పు, 2. పడమర, 3. ఉత్తరం, 4. దక్షిణం, 5. ఈశాన్యం, 6. వాయువ్యం, 7. నైఋతి, 8. ఆగ్నేయం అయితే ఈ ఎనిమిది దిక్కులలో మొదటి నాలుగు దిక్కులు ప్రధానమైనవిగానూ మిగిలిన నాలుగు దిక్కులను ఉపదిక్కులు లేదా విదిక్కులు అని పిలవటం జరుగుతున్నది. ఈ అష్ట దిక్కులకు 8 గ్రహాలు ఆధిపత్యం వహిస్తూ ఉంటాయి.

**తూర్పు:** ఈ దిక్కునకు సూర్యుడు అధిపతిగా ఉంటాడు. ఏ గృహామునకైనా తూర్పుదిక్కు మధ్యభాగంలో ప్రధాన ద్వారం ఉన్నచో ఆఇంటి యజమాని పట్టుదల కలవాడు మరియు ముక్కుసూటిగాపోయేవాడు కాగలడు. ఆయజమాని చేదు ఆహార పదార్థాలను ఇష్టపడుతూ ఉంటాడు. (మెంతులు, కాకర, మొదలైనవి.)

**పశ్చిమం:** పశ్చిమ దిక్కుకు సూర్య పుత్రుడు అయిన శని భగవానుడు ఆధిపత్యం వహించి ఉంటాడు. ఏ గృహము యొక్క పశ్చిమ దిక్కు మధ్యభాగంలో ప్రధాన ద్వారం ఉంటుందో ఆఇంటి యజమాని ఆలోచనా వంతుడిగానూ ఓర్పుగలవాడిగానూ మరియు గూఢ స్వభావిగా ఉండగలడు. ఆఇంటి యజమాని ఘాటైన పదార్థాలను (మషాలాలు) మరియు శీతల పానీయాలను ఇష్టపడుతూ ఉంటాడు.

**ఉత్తరం:** ఉత్తర దిక్కుకు బుధ గ్రహం ఆధిపత్యం వహించి ఉంటాడు. ఏ గృహము యొక్క ఉత్తర దిక్కు మధ్యభాగంలో ప్రధానద్వారం ఉంటుందో ఆయింటి యజమాని మంచి తెలివితేటలు, చమత్కార స్వభావము కలిగి ఉంటాడు. ఇంకా అతడు విద్యావ్యాసంగములలో ఆసక్తి కలిగి ఉంటాడు. ఆహార పదార్థాలపట్ల ప్రత్యేకమైన ఆసక్తి ఇతనికి ఉండదు.

**దక్షిణం:** దక్షిణ దిక్కుకి ఉష్ణ స్వభావము గల కుజగ్రహము ఆధిపత్యము వహించి ఉంటుంది. ఏ గృహముయొక్క దక్షిణ దిక్కుమధ్యభాగంలో ప్రధానద్వారం ఉంటుందో ఆయింటి యజమానిపై కుజగ్రహ ప్రభావము సంపూర్తిగా ఉంటుంది. ఆ యజమాని శీఘ్రకోపి, చపలచిత్తుడు మరియు గుండెనిబ్బరము కలవాడయి ఉంటాడు. ఇతడు నూనెలు మరియు మషాలలతోకూడిన ఆహారము ఇష్టపడుతూ ఉంటాడు.

**ఈశాన్యం:** ఈశాన్యం దిక్కును వాస్తు శాస్త్రంలో దైవ సంబంధమైన దిక్కు అని పిలుస్తారు. ఆకారణంగానే గృహాలలో దేవుడి పటాలను లేదా మందిరాలను ఈశాన్య దిక్కులో ఏర్పాటుచేయటం జరుగుతున్నది. ఈ దిక్కుకి దేవతల గురువు అయిన గురు గ్రహం అధిపతిగా ఉంటుంది. ఏ గృహమునకు ఈశాన్య దిక్కులో ప్రధాన ద్వారం ఉంటుందో ఆఇంటి యజమాని మేధావి, దయగలవాడు మరియు మతపరమైన ఆచారాలను ఖచ్చితంగా పాటించేవాడు కాగలడు. వీరు చాలామధురంగా మాట్లాడుతూ ఉంటారు.

**ఆగ్నేయం:** ఈ దిక్కునకు శుక్రగ్రహం ఆధిపత్యం వహిస్తూ ఉంటుంది. ఏ గృహము యొక్క ఆగ్నేయ దిక్కులో ప్రధాన ద్వారం ఉంటుందో ఆయింటి యజమాని నిత్యసంతోషి మరియు శృంగార ప్రియుడు కాగలడు. వీరు సుగంధద్రవ్యాలను మరియు అలంకారాలను ఇష్టపడుతూ ఉంటారు. పెరుగు, మీగడ లాంటి మధుర పదార్థాలను ఇష్టపడుతూ ఉంటారు.

**నైఋతి:** ఈ దిక్కునకు ఛాయా గ్రహము అని పిలువబడు రాహువు ఆధిపత్యము వహిస్తూ ఉంటాడు. ఏ గృహముయొక్క నైఋతిదిక్కులో ఆఇంటి ప్రధానద్వారం ఉంటుందో ఆ యింటియజమానిపై రాహుగ్రహ ప్రభావం సంపూర్తిగా ఉంటుంది. ఇటువంటి గృహముల యొక్క యజమానులు కుట్ర స్వభావాన్ని మరియు దురహంకారమును కలిగి ఉంటారు. వీరు ఆత్మవంచనచేసుకుంటూ కపటంగా ప్రవర్తిస్తూ ఉంటారు. వీరువేడిగాఉండే పదార్థాలను, మాంసాహారాన్ని ఇష్టపడుతూ ఉంటారు. వీరు పాడైపోయిన పదార్థాలను కూడా నిస్సంకోశంగా స్వీకరిస్తారు.

**వాయువ్యం:** ఈ దిక్కుకి చంద్రుడు అధిపతిగా ఉంటాడు. ఏ ఇంటికి లేదా భవనానికి వాయువ్య దిక్కులో ప్రధానద్వారం ఉంటుందో ఆయింటి యజమాని విపరీతమైన భావోద్వేగాలను, చెపలచిత్తాన్ని కలిగి ఉంటాడు. వీరు ప్రయాణాలను ఇష్టపడతారు. వీరు ఆకుకూరల్ని, ఉప్పుని అధికంగా తీసుకుంటారు.

ఎవరైనా ఒక గృహాన్ని నిర్మించుకోటానికి ఒక స్థలాన్నికొనేముందు ఆస్థలంయొక్క గత రెండువందల సంవత్సరాల చరిత్రను తెలుసుకోవాల్సి ఉంటుంది. అంతేకాకుండా ఆస్థలంయొక్క పరిసరాలను జాగ్రత్తగా పరిశీలించవలసి ఉంటుంది. కారణం కొన్ని సంధర్భాలలో భూకంపాల కారణంగా దేవాలయాలు లేదా భవనాలు భూమి అడుగున కప్పబడిపోతాయి. అలాగే నదులు, స్మశానాలు ఉండే స్థలాలను కబ్జాచేసి స్థలాలుగాచేసి మార్చటం ప్రస్తుతం జరుగుతున్న విషయమే. కనుక భూమి అడుగున ఆలయాలు, భవనాలు, నదీ ప్రవాహాలు కప్పబడిపోయిన స్థలాలను కొనుగోలుచేయరాదు. (ఈనాడు హైదరాబాద్‌లో చాలాప్రాంతాలు జలమయంఅయి ఇళ్ళుముని గిపోయి ప్రజలు నానాబాధలు పడుతున్నారు దీనికి కారణం వర్షాకాలంలో మూసీనది ఉధృతంగా ప్రవహిస్తున్నప్పుడు కొన్ని ప్రదేశాల గుండా కూడా ఆనదియొక్క నీరు ప్రవహించటం జరుగుతుంది. అలాంటి స్థలాలను పూడ్చి వేసి ఇళ్ళస్థలాలుగా మార్చి ఇళ్ళు కట్టటం జరుగుతున్నది.

మనుషులు మారినంత సులభంగా నదీ ప్రవాహాలు మారవుకనుక అధికనీటి ప్రవాహాలు ఆస్థలాలను ముంచివేయటం జరుగుతున్నది. ఈరకంగా చూస్తే అలాంటి ప్రదేశాలలో ఇల్లు కట్టరాదు అని వాస్తుశాస్త్రం చెప్పటం హేతుబద్ధంగా లేదూ!) కొన్ని స్థలాలు నగరంలో మంచి సెంటర్‌లో దొరికినా ఆస్థలం యొక్క గతచరిత్ర సరిగాలేకపోతే కొనటం మంచిదికాదు.

అదేవిధంగా స్మశానాల ప్రక్కన ఉండే గృహాలను లేదా స్థలాలను, ప్రసూతి కేంద్రంగా లేదా ఆసుపత్రిగా ఒకప్పుడు ఉపయోగించిన గృహాలను లేదా స్థలాలను పొరపాటునకూడా కొనకూడదు. కారణం అలాంటి ప్రదేశాలలో చనిపోయినవారియొక్క ఆత్మలు ఎప్పటికీ సంచరిస్తూనే ఉంటాయి. అలాంటి ఆత్మలు కంటికి కనిపించవు. కానీ అక్కడ నివసించటానికి వచ్చేవారిని వివిధ రకాలుగా హింసించి అక్కడ నుండి తరిమివేయటం మాత్రం ఖచ్చితంగా జరుగుతుంది. అదేవిధంగా ఒక కుటుంబంలో అనేకమంది అకాలమృత్యువు పాలయిన లేదా ఆత్మహత్యలు చేసుకున్న గృహాన్ని కొనరాదు. అది ఎంత చవకగావచ్చినా కొనకూడదు.

అదేవిధంగా ఒక స్థలంలో ఐదుఅడుగుల లోతులో ఎముకలు, కాలిన దుంగలు లేదా వెంట్రుకలు బయటపడితే అట్టి స్థలం కొనటం ప్రమాదకరమని గుర్తించాలి. ఏస్థలంలో లేదా గృహంలో అయినా త్రాచుపాములు తరచుగా కనిపిస్తుంటే అట్టి గృహాలను లేదా స్థలాలను కొనటానికి సాహసించరాదు. కారణం పాములు ఒకప్రదేశంలో తరచుగా కనిపిస్తున్నాయంటే అర్థం ఆప్రదేశంలో ఏదోఒక మూల పాము కలుగులు ఉన్నాయని, ఆకలుగుల్లో చాలాపాములు ఉండిఉంటాయని గ్రహించాలి.

ఒక స్థలాన్ని ప్రేతాత్మలు ఆవహించినపుడు కొన్ని ప్రత్యేక సంఘటనలు ఆస్థలంలో జరుగుతాయి. అవి ఎలాఉంటాయో పరిశీలించండి. అలాంటి స్థలాలలో గృహాలను నిర్మిస్తున్నప్పుడు పనివాళ్ళు పైనుంచి క్రిందపడి మరణించడమో లేదా అకారణంగా గోడలు కూలిపోవటమో లేదా ఇంటిని నిర్మిస్తున్న వ్యక్తికి డబ్బు కొరత ఏర్పడి ఇల్లు కట్టటం ఆగిపోవటం జరుగుతుంది. ఉసిరి, నిమ్మ, చింత మరియు మర్రిచెట్లు ఉన్న ఖాళీ స్థలాలను కొనరాదు. కారణం పైనపేర్కొన్న చెట్లు ఉన్న ప్రదేశంలో అదృశ్యశక్తులు సంచరిస్తున్నాయని అర్థం చేసుకోవాలి. ఇంకో ముఖ్యమయిన విషయంకూడా గుర్తుపెట్టుకోవాలి. కొన్ని గృహాలపై చేతబడిలాంటి క్షుద్రవిద్యలు ప్రయోగించబడినపుడుకూడా ఆగృహం మానవ నివాస యోగ్యంగా ఉండదు. ఏమైనా శాంతికర్మలు జరిపించితే తప్ప అలాంటి గృహాలను కొనటం ఎంతమాత్రం మంచిదికాదు.

# 16. సూర్య మరియు చంద్ర గ్రహణాలు మానవులపై ఎలాంటి ఫలితాలను కలిగిస్తాయి?



**చంద్రగ్రహణము, సూర్యగ్రహణం**

భూమికి సూర్యునికి మధ్యలో చంద్రుడు అడ్డు వచ్చినపుడు సూర్య గ్రహణం అంటారు. భూమికి సూర్యునికి మధ్య చంద్రుడు అడ్డంవచ్చి సూర్యకాంతి భూమిపై పడకుండా చేస్తాడు. అందువలన భూమిపై ఉన్నవారికి సూర్యుడు కనపడడు. దీనినే సూర్యగ్రహణం అని పిలుస్తారు. సూర్యగ్రహణం అమావాస్య తిథినాడు ఏర్పడుతుంది. ఆ తిథినాడు సూర్యచంద్రుల మధ్యదూరం $0^{\circ}$ గా ఉంటుంది. అంటే సూర్య చంద్రులు ఆ సమయంలో ఒకే బిందువువద్ద ఉంటారని గ్రహించాలి. సూర్యగ్రహణం ఎల్లప్పుడూ పగటి సమయంలో మాత్రమే ఏర్పడుతుంది.

చంద్రుడు భూమికి ఉపగ్రహంగా ఉంటూ భూమితోబాటు సూర్యుని చుట్టూ కూడా తిరుగుతున్నాడు. ఈవిధంగా చంద్రుడు, భూమి మరియు సూర్యుని చుట్టూ తిరుగుతున్న సమయంలో కొన్ని నెలలకు ఒకసారి సూర్యుడు, చంద్రుడు, భూమి ఒకే సరళ రేఖమీదకి వచ్చే అవకాశం ఉంది. అలాంటి సమయంలో సూర్యుని కాంతి చంద్రుని చేరకుండా భూమి అడ్డువస్తే చంద్రగ్రహణం అంటారు.

సూర్య మరియు చంద్ర గ్రహణాలు మానవులపై ఎలాంటి ప్రభావం చూపించవని కొందరు హేతువాదులు వాదిస్తున్నారు. హిందువులు గ్రహణ సమయాలలో వీలైనంత వరకూ ఇల్లు వదలి బయటకు వెళ్ళకుండా ఇంట్లోనే ఉండి గ్రహణం వదిలిన తరువాత తలస్నానంచేసి, ఆపై బయటకు వెళ్ళటం జరుగుతుంది. ముఖ్యంగా గర్భిణీ స్త్రీలు గ్రహణ సమయాలలో ఇంట్లో

ఉండటమే కాకుండా, ఆసమయంలో ఏవిధమైన ఆహారాన్ని తీసుకోకుండా ఉండటం జరుగుతున్నది. అయితే ఇటీవలకాలంలో కొందరు నాస్తికులు గ్రహణాలవల్ల గర్భిణీస్త్రీలకు ఏవిధమైన ప్రమాదం ఉండదని నిరూపించటం కోసం ఇటీవల సంభవించిన సూర్య గ్రహణ సమయంలో బహిరంగంగా బిర్యాని పార్టీ ఇవ్వాలని ప్రయత్నించారు. ఆ పార్టీకి అన్యమతానికి చెందిన ముగ్గురు గర్భిణీ స్త్రీలనుకూడా తీసుకువచ్చి వాళ్ళచేత కూడా గ్రహణ సమయంలో బహిరంగ ప్రదేశంలో బిర్యాని తినిపించాలని ముచ్చట పడ్డారు.

ఆ నాస్తికుల ప్రధ్యాన లక్ష్యం హిందూ మతస్తుల నమ్మకాలను మూఢ నమ్మకాలుగా నిరూపించి, హిందువులను మూర్ఖులుగా నిరూపించటం అని బుర్ర ఉన్న ప్రతి ఒక్కరికీ అర్ధమయ్యింది. గ్రహణ సమయాలలో ఆకాశం నుండి ప్రమాద కరమయిన మరియు విష పూరితమయిన కంటికి కనిపించని కిరణాలు భూమి మీద (గ్రహణం కనిపించినచోట) పడతాయి. అలా విషకిరణాలు పడిన ఆహార పదార్ధాలు విషపూరితమై వాటిని స్వీకరించినవారికి అనూహ్యమైన రోగాలను కలిగించే అవకాశమున్నది. ఆకారణంగానే మన పూర్వీకులు గ్రహణ సమయాలలో బయటకి వెళ్ళకూడదని చెప్పటం జరిగింది. పోనీ నాస్తికులు భావించినట్టుగానే గ్రహణాల వల్ల మనుషులకు ఏ ప్రమాదం లేనిమాట వాస్తవం అయితే గ్రహణాలను ముఖ్యంగా సూర్యగ్రహణాన్ని నేరుగా కంటితో చూడవద్దని ఎందుకు చెబుతున్నారు? అంటే గ్రహణ సమయంలో విడుదలయ్యే అతి నీలలోహిత కిరణాలవల్ల కళ్ళు పోతాయని వాళ్ళు అంగీకరిస్తున్నట్టేకదా? సరే వారి సంగతి అలా ఉంచి సూర్య మరియు చంద్ర గ్రహణాలు మానవులపై మరియు ఆర్ధిక రంగంపై ఎలాంటి ప్రభావాన్ని కలిగిస్తాయి అన్న విషయాన్ని తెలుసుకుందాం.

సూర్య గ్రహణం రాహువు కారణంగా ఏర్పడినపుడు స్టాక్ మార్కెట్ ఊపందుకుని షేర్ల ధరలు బాగా పెరిగిపోవటం జరుగుతుంది. అలాగే కేతువు కారణంగా సూర్య గ్రహణం సంభవిస్తే షేర్ల ధరలు అమాంతం పడిపోతాయి. సూర్య గ్రహణం ప్రతి ఆరునెలలకు రాహువు లేదా కేతువు ద్వారా సంభవిస్తుంది. ఇక్కడ ఇంకో విషయం కూడా మనం గమనించాల్సి ఉంటుంది. రాహువు గ్రహణ ఫలితంగా పెరిగే షేర్ల ధరలు మళ్ళీ వచ్చే సూర్యగ్రహణందాకా పెరుగుతూనే ఉంటాయి. ఇక కేతువు కారణంగా కలిగే సూర్య గ్రహణం సమయంలో షేర్ల ధరలు తగ్గటం మొదలై మళ్ళీవచ్చే గ్రహణందాకా అదే ధోరణి (trend) కొనసాగుతుంది.

గ్రహణ సమయాలలో సాధారణ హైందవులు దైవధ్యానంతో కాలాన్ని గడుపుతారు. తాంత్రికులు, మంత్రాన్ని ఉపాసించేసాధకులు గ్రహణ సమయాల్లో మెడలోతు నీళ్ళలో దిగి తమ ఇష్టదేవతల్ని మరియు తమకు తెలిసిన మంత్రాలను మననంచేసుకోవటం జరుగుతుంది. గ్రహణ సమయాలలో మంత్రాలయొక్క ప్రభావం చాలా అధికంగా ఉంటుంది. ఆకారణంగానే తాంత్రికులు గ్రహణ సమయాలలో తమ మంత్రశక్తిని మరింతగా పెంచుకోవటానికి ప్రయత్నించటం జరుగుతుంది.

గ్రహణకాలాన్ని పరమదోష కాలంగా హైందవ మతం గుర్తిస్తుంది కనుక ఆ సమయాలలో సమస్త హైందవ దేవాలయాలు మూసివేయబడతాయి. అయితే ఇందుకు శ్రీకాళహస్తిలోని కాళహస్తీశ్వరాలయం ఒక మినహాయింపుగా గుర్తించాలి. కారణం గ్రహణ సమయాలలో ఆ ఆలయంలో రాహు, కేతువులకు పూజలు చేయటం జరుగుతున్నది. కానీ ఇలా చెయ్యటం మహాదోషం అని తమిళనాడుకు చెందిన ఒక పండితుడు తెలియజేసారు. గ్రహణ సమయాలలో ఆలయాలని మూసి ఉంచటం ధర్మం. కానీ ధన సంపాదనే ధ్యేయంగా మారిన ఈకాలంలో ఈ నియమాన్ని ఉల్లంఘించి గ్రహణ సమయంలో రాహు, కేతు దోషములున్నవారికి పూజలు జరిపించి లక్షలాది రూపాయలు ఆదాయం ఆ ఆలయానికి చేకూర్చటం జరుగుతున్నది. ఇలా గ్రహణ సమయాలలో గుడిని తెరిచి ఉంచి వ్యాపారం లాంటి పూజలను చేస్తున్న కారణంగానే ఇటీవలకాలంలో కాళహస్తి గుడిలోని ధ్వజస్తంభం కూలిపోయింది. కనుక ఇక మీదటయినా హైందవ ప్రజల శ్రేయస్సుకోసం గ్రహణ సమయాలలో కాళహస్తీశ్వరాలయం మూసి ఉంచటం మంచిదని పండితులు అభ్యర్థిస్తున్నారు.

జ్యోతిషశాస్త్ర ప్రకారం పూర్ణచంద్రుడికి రాహు గ్రహం అడ్డు వచ్చినపుడు ఆ చంద్రుడు భూమిమీద ఉన్న మానవులకు కనిపించడు. అదే చంద్రగ్రహణం అని పిలువ బడుతుంది. గ్రహణ సమయాలలో పవిత్ర నదులలోగాని, సముద్రంలోని గానీ స్నానాలుచేస్తే తెలిసిగానీ, తెలియకగానీ చేసే పాపాలు నశించిపోతాయి. గ్రహణ సమయాలలో కొన్ని అసాధారణ సంఘటనలు కూడా జరుగుతూ ఉంటాయి. ఒక చంద్ర గ్రహణ సమయంలో కృష్ణభక్తి ఉద్యమాన్ని స్థాపించిన చైతన్య మహాప్రభువు జన్మించటం జరిగింది.

**గ్రహణ సమయాలలో పాటించవలసిన జాగ్రత్తలు :**

1. సూర్య మరియు చంద్ర గ్రహణ సమయాలలో గర్భిణీ స్త్రీలు గ్రహణాన్ని ఎట్టి పరిస్థితులలోనూ ప్రత్యక్షంగాగానీ, పరోక్షంగాగానీ (ప్రత్యేక అద్దాల ద్వారాగానీ, గాజుపెంకుకు మసిపట్టించిగానీ) చూడరాదు. గర్భిణీ

స్త్రీలు గ్రహణ సమయంలో బయటకు వస్తే గ్రహణం తాలూకు విషపూరిత కిరణాలు వారి గర్భాలలోని శిశువులకు అంగవైకల్యాన్నికానీ, మనోవైకల్యాన్నికానీ కలిగించే అవకాశం ఉన్నదని తెలుస్తున్నది. గ్రహణ సమయాలలో గర్భిణీ స్త్రీలు పూలు దండలు కట్టటంకానీ, దేనినైనా తుంచటంకానీ, కత్తిరించటంకానీ చేయరాదు. అలా చేయటంవల్ల పుట్ట బోయే బిడ్డకు గ్రహణం మొర్రివంటి లోపాలు వచ్చే అవకాశాలు బలంగా ఉంటాయి. అదేవిధంగా కుట్టటంకానీ, గుచ్చటంకానీ చేయరాదు. అలాచేస్తే గర్భంలోని శిశువుయొక్క అంతర్గత అవయవాలలో లోపాలు ఏర్పడవచ్చు. గ్రహణ సమయాలలో ఇంట్లో ఉండే నీటిలో తులసి ఆకులను వేసి ఉంచినట్లయితే ఆ నీరు త్రాగటానికి ఉపయోగించవచ్చు. అందుకు కారణం ఏమిటంటే తులసిఆకు పవిత్రమైనదేకాక, కొన్ని ప్రత్యేకమైన ఔషద విలువలను కలిగి ఉన్నది. గ్రహణ సమయంలో భూమి మీద పడే విషకిరణాలయొక్క ప్రభావాన్ని పోగొట్టగలిగే శక్తి తులసి ఆకులకు ఉన్నదని శాస్త్రీయంగా నిరూపించబడినది.

2. గ్రహణ సమయాలలో యజ్ఞ యాగాదులు పూజలు చేయరాదు. ఆ సమయంలో నూతన దంపతులకు శోభనం ఏర్పాటుచేయకూడదు. గ్రహణ సమయంలో కేవలం భగవంతుడిని ధ్యానిస్తూ కూర్చోవటం చాలామంచిది. కొంత మందికి గ్రహణ సమయాలలో బయటకి వెళ్ళాల్సిన పని ఏర్పడినపుడు వారు ఎట్టి పరిస్థితులలోనూ గ్రహణాన్ని చూడకుండా ఉండటమేకాకుండా గ్రహణ కాలంలో బయట ఏవిధమైన ఆహారాన్ని తీసుకోకుండా ఉండాలి.

3. గ్రహణ సమయంలో బయట ఉతికిన బట్టలు ఆరవేయరాదు. అలా చేస్తే గ్రహాలనుండి వచ్చే విషపూరిత కిరణాలు ఆ బట్టలను దోషపూరితం చేస్తాయి. ఒకవేళ గ్రహణంలో బట్టలు ఆరవేసినట్లయితే గ్రహణానంతరం ఆ బట్టలను మళ్ళీ నీళ్ళలో జాడించి ఆరవేయటం మంచిది. ఇక్కడ ముఖ్యమైన విషయం చెప్పాల్సి ఉంది. అది ఏమిటంటే ఉలెన్‌తో తయారయ్యే దుప్పట్లు మరియు వస్త్రాలను పౌర్ణమి చంద్రుడు కనిపించిన సమయంలో బయట ఆరవేసినట్లయితే చంద్రుని నుండి వచ్చే కిరణాల వలన ఆ ఉలెన్ వస్త్రాలు శుభ్రపడతాయి. కానీ చంద్రగ్రహణ సమయంలో బయట ఆవేయబడిన ఉలెన్ దుస్తులు గ్రహణ చంద్రుని నుండి దోషపూరిత కిరణాల వల్ల హానికర ప్రభావాన్ని పొందటం జరుగుతుంది. గ్రహణ సమయంలో వండిన వంటకాలను అది దేముడి ప్రసాదం అయినాసరే ఎట్టి పరిస్థితులలోనూ స్వీకరించరాదు. అదేవిధంగా గ్రహణ సమయాలలో బావులపైన, ఆరుబయట ఉండే నీళ్ళ తొట్లపైన తప్పనిసరిగా మూతలు వెయ్యాలి.

చంద్రగ్రహణం జరుగుతున్నప్పుడు వామాచారాన్ని పాటించే మంత్ర గాళ్ళు ఇతరులపై చేతబడులను చేయటం జరుగుతుంది. ఆదివారం, అమావాస్య కలిసి వస్తే ఎంత శక్తివంతంగా ఉంటుందో చంద్రగ్రహణ సమయంలోకూడా అంత శక్తి వంతమైన సమయం వస్తుంది. చంద్రగ్రహణ సమయంలో చనిపోయినవారి ఆత్మలు ఇతర భూత, ప్రేత, పిశాచాలు భూమిపై సంచరిస్తాయి. ఆ సమయంలో మంత్ర ప్రయోగాలుచేసే మంత్రగాళ్ళకు అవి కనిపించటం జరుగుతుంది.

గ్రహణాలు సంభవించినపుడు భూమిపైన అనేక మార్పులు రావటం జరుగుతుంది. కొన్నిసార్లు సూర్యగ్రహణం ముగిసిన వెంటనే భూకంపాలు రావటం జరుగుతుంది. ఒక ఆశ్చర్యకర విషయమేమిటంటే గ్రహణంయొక్కనీడ పడిన ప్రాంతాలలోనే ప్రకృతి సిద్ధమైన భూకంపాలు, తుఫానులు వస్తున్నట్టుగా శాస్త్రజ్ఞుల పరిశీలనలో తెలిసింది.

సూర్య లేదా చంద్రగ్రహణాలు ఏర్పడినపుడు ప్రపంచంలోని ఏదోఒక ప్రాంతంలో ముఖ్యమైన సంఘటనలుగానీ, ప్రకృతి విపత్తులుగానీ సంభవించటం జరుగుతుంది. ముఖ్యంగా ఒక గ్రహణం సంభవించి మరల ఇంకొక గ్రహణం సంభవించేలోగా ఈ మార్పులు జరిగే అవకాశం ఉంటుంది. కొంతమంది హేతువాదులు గ్రహణాలకు ఏవిధమైన ప్రభావాలు ఉండవని మొండిగా వాదిస్తున్నారు. కానీ గ్రహణాలకు భూమిపై జరిగే కొన్ని సంఘటనలు విడదీయరాని సంబంధం ఉంటుందని నిరూపించే కొన్ని ఉదాహరణలను ఇక్కడ తెలియజేస్తున్నాను పరిశీలించండి.

ప్రపంచ చరిత్రలో అంటే ఆధునికకాలంలో బ్రిటన్ యువరాణి డయానా సృష్టించిన సంచలనం ఇంతా అంతాకాదు. ఒక సామాన్య కుటుంబంలో పుట్టిన డయానా సాక్షాత్తు బ్రిటీష్ సింహాసనానికి వారసుడైన ప్రిన్స్ చార్లెస్‌ని వివాహం చేసుకోవటం ఒక చరిత్రగా నిలిచిపోయింది. డయానా జూలై 1, 1961వ సంవత్సరంలో జన్మించింది. డయానాకు మరియు యువరాజు చార్లెస్‌కి జూలై 29, 1981వ సంవత్సరంలో వివాహం జరిగింది. వారి వివాహం జరిగిన రెండు రోజుల తరువాత సూర్యగ్రహణం సంభవించింది. డిసెంబర్9, 1992సంవత్సరంలో డయానా దంపతులు విడిపోవటం జరిగింది. అలా వారు విడిపోయిన రాత్రి చంద్రగ్రహణం ఏర్పడింది. ఇంకొక ఆసక్తికరమైన విషయమేమిటంటే ప్రిన్స్‌చార్లెస్ నవంబర్ నెలలో 1945 వ సంవత్సరంలో జన్మించినపుడు ఒక సూర్యగ్రహణం సంభవించింది. అంతేకాకుండా ఆ గ్రహణ సమయంలో ఆఫ్రికా ప్రాంతంలో ఒక వెలుగును చిమ్మే తోకచుక్క విను వీధిలో కనిపించింది.

ఒక్కోసారి ఒక నెలరోజుల వ్యవధిలో మూడు గ్రహణాలు వరుసగా రావటం జరుగుతుంది. అలా జరిగినపుడు ప్రపంచ వ్యాప్తంగా గానీ లేదా ప్రపంచంలో ఏదోఒకమూల గానీ ఏదైనా వినాశనకరమైన సంఘటన జరుగుతుందని గత అనుభవాలు తెలియజేస్తున్నాయి.

1. క్రీ.పూ. 3067, నవంబర్ 22వ తేదీన కౌరవ, పాండవులమధ్య కురు క్షేత్ర యుద్ధం ప్రారంభం అయ్యింది. ఈ యుద్ధంలో లక్షలాదిమంది సైనికులు మరియు వేలాది గుర్రాలు, ఏనుగులు ప్రాణాలు కోల్పోవటం జరిగింది. ఒకరకంగా చెప్పాలంటే కురుక్షేత్రయుద్ధం మానవజాతి చరిత్రలో సంభవించిన ఒక వినాశనకర సంఘటనగా భావించవచ్చు. ఈ కురుక్షేత్రయుద్ధం జరగటానికిముందు ఒకే నెలలో మూడు గ్రహణాలు వరుసగా రావటం జరిగింది. అది ఎలాగంటే.....

క్రీ.పూ. 3067, సెప్టెంబర్ 29. చంద్రగ్రహణం.

క్రీ.పూ. 3067, అక్టోబర్ 14. సూర్యగ్రహణం.

క్రీ.పూ. 3067, అక్టోబర్ 28, చంద్రగ్రహణం

1945, జూలై 9వ తేదీన కర్కాటకరాశిలో రాహుగ్రస్త సంపూర్ణ సూర్యగ్రహణం ఏర్పడింది. ఈ గ్రహణం సంభవించిన సరిగ్గా 29వ రోజున అనగా 1945 ఆగష్టు 6వ తేదీన జపాన్‌దేశంలోని హిరోషిమా పట్టణంపై లిటిల్‌బాయ్ అనే పేరుగల అణుబాంబు ప్రయోగించబడింది. ఆ తరువాత మూడురోజులకి అనగా ఆగష్టు 9వ తేదీన జపాన్‌లోని ఇంకోపట్టణమైన నాగసాకిపై ఫ్యాట్‌మాన్ అనే అణుబాంబు ప్రయోగించబడింది. ఆ రెండు పట్టణాలపై అమెరికా ప్రయోగించిన న్యూక్లియర్ బాంబులు అక్కడ ఎంతో జనవినాశనాన్ని, ఆస్తుల నష్టాన్ని కలిగించాయి.

1991, జూలై 11వ తేదీన కర్కాటకరాశిలో కేతుగ్రస్తమైన సంపూర్ణ సూర్య గ్రహణం ఏర్పడింది. ఈ గ్రహణం సంభవించిన 5నెలలలోగా విశాలమైన సోవియట్ యూనియన్ సామ్రాజ్యం అనేక భాగాలుగా చీలిపోయింది.

1974, జూన్ 20వ తేదీన మిధునరాశిలో సంపూర్ణ సూర్యగ్రహణం సంభవించింది. ఈ గ్రహణం సంభవించిన 50 రోజుల లోగా నాటి అమెరికా అధ్యక్షుడైన రిచర్డ్ నిక్సన్, వాటర్‌గేట్ కుంభకోణంలో పార్లమెంట్ అవిశ్వాస తీర్మానంకు గురిఅయి పదవిని కోల్పోవటం జరిగింది.

ఇంతవరకు చరిత్రలో నమోదుఅయిన సూర్యగ్రహణాలు సంభవించిన తరువాత ప్రపంచంలోని కొన్ని ప్రాంతాలలో తీవ్రమయిన భూకంపాలు వచ్చినట్లుగా తెలుస్తున్నది.

## 17. దలైలామా పాటించే మంత్రవిధానం వివరాలు ఏమిటి?

చైనా కమ్యూనిష్టు ప్రభుత్వ అణిచివేతను భరించలేక నాటి భారత ప్రధాని నెహ్రూపండితుడి సహకారంతో, చైనా ప్రభుత్వం కళ్ళు కప్పి అర్ధ శతాబ్దిక్రితం భారతదేశానికి వలసవచ్చి, హిమాచల్‌ప్రదేశ్‌లోని 'ధర్మశాల' అనే ప్రాంతంలో స్థిరపడ్డారు మహాయానబౌద్ధుల రాజు మరియు మతాచార్యుడుదలైలామా. ఇంతకీ 'దలైలామా' అంటే ఒకవ్యక్తి పేరుకాదు. అది బౌద్ధుల మహాగురువుకి చెందినపేరు. దలైలామా అన్నది ఒక పదవి. చనిపోయే వరకూ ఒకవ్యక్తి దలైలామాగా ఉంటాడు. ఆయన చనిపోవటానికి ముందే ఇంకో దలైలామా ఎక్కడ ఉంటారో ఆయనే తెలియచేయటం జరుగుతుంది.

'దలైలామా' మహాయానబౌద్ధ మతంలోని ప్రధాన విభాగం అయిన 'వజ్రయాన' బౌద్ధాన్ని పాటిస్తున్నారు. మంత్రాలు, తంత్రాలు ఉపయోగించి దైవాన్ని చేరుకోవచ్చు అన్నదే ఈ వజ్రయాన మతంయొక్క ప్రధాన సిద్ధాంతం.

**బౌద్ధమతం మూడు శాఖలుగా చీలిపోయింది.** 1. థెరవాద అనగా పెద్దలు (elders) అని అర్థం. ఈ వర్గం సన్యాసులు అన్నింటినీ పరిత్యజించి. బుద్ధుని బోధనలు ఆధారంగా సన్యాసి జీవితం గడిపి 'నిర్యాణ్యం' అనగా జన్మరాహిత్యాన్ని పొందుతారు. 2. మహాయానం అనగా గొప్ప వాహనం అనిఅర్థం. ఈ వర్గానికి చెందినవారు ప్రేమ, సానుభూతి కలిగి అన్న భావనలు ఆధారంగా జీవితాన్ని సాగించి ముక్తిని పొందుతారు. 3. వజ్రయానం బౌద్ధ మతంలోని మూడవర్గం. వజ్రయానం అనగా వజ్రముతో తయారుచేయబడ్డ వాహనం అనిఅర్థం.

బౌద్ధమత శాఖలకి 'వాహనాలు' అన్న అర్థం వచ్చే వజ్రయానం, మహాయానం అనిపేర్లు ఎందుకు పెట్టబడ్డాయి అన్న సందేహం ఎవరికైనాసరే వస్తుంది. ఇక్కడ 'యానం' అనగా వాహనం అంటే దైవాన్నిచేరుకునే వాహనం అని అర్థం. అంటే 'వజ్రయానం' అనగా ఆ మత విధానం అనే వాహనంలో దైవాన్ని చేరవచ్చు అన్నమాట.

క్రీ.శ. 500 సంవత్సరంలో వాయువ్యభారతదేశం (సింధుప్రాంతం)లో ఈ వజ్రయాన బౌద్ధమతం పుట్టింది. మహాయాన శాఖనుండి 'వజ్రయానం' జన్మించింది. నేటి బీహార్‌రాష్ట్రంలోఉన్న నలందా విశ్వవిద్యాలయంలో క్రీ.శ. 4వ శతాబ్దంలో వజ్రయాన బౌద్ధమతానికి చెందిన కొన్ని గ్రంధాలు విడుదల అయ్యాయి. మంత్రాలు, ముద్రలు (హస్తముద్రలు), మండలాలు (యంత్రాలలాంటి), తంత్రాలు వజ్రయానంలో భాగాలుగా ఉన్నాయి. ఇతర బౌద్ధమత శాఖలు, ఈ వజ్రయానం బుద్ధుని బోధనలకు వ్యతిరేకంగా ఉన్నదనీ, క్షుద్రమంత్రాలు, తంత్రాలు పాటిస్తున్నదనీ విమర్శించాయి.

క్రీ.శ. 8వ శతాబ్దం నుండి టిబెట్, మంగోలియా మరియు జపాన్ దేశాలలో వజ్రయానం వ్యాప్తిలోకి వచ్చింది. టిబెట్‌లో ప్రధాన స్థావరం కలిగి ఉన్న వజ్రయాన బౌద్ధం భూటాన్, ఉత్తరభారతదేశం, నేపాల్, రష్యాదేశం లోని కొన్ని ప్రాంతాలలో, మంగోలియాలో మరియు చైనాదేశంలోని ఉత్తర మరియు నైఋతి తీరప్రాంతాల్లో విస్తరించి ఉన్నది.

రెండవ బుద్ధుడు, అని కీర్తి పొందిన పద్మ సంభవుడు అనే మహామాంత్రిక గురువుని క్రీ.శ. 8వ శతాబ్దంలో వజ్రయానం ఆవిర్భవించటానికి కారకుడిగా భావిస్తారు. ప్రాణాయామం, యోగా, ధ్యానం మరియు మంత్రాలతో ఆధ్యాత్మిక సాధనచేస్తారు ఈ వజ్రయాన మతస్థులు.

వజ్రయానం బౌద్ధమతంలో దైవ శక్తుల్ని ఆవాహన చేసుకునే కొన్ని యంత్రాల వంటి సాధనాలున్నాయి. వాటిని మండలాలు అని పిలుస్తారు. హైందవులు శ్రీచక్రం, సుదర్శన యంత్రం, కూర్మ యంత్రం లాంటివి ఎలా పూజిస్తారో అలాగే వజ్రయాన మతాన్ని పాటించే బౌద్ధులు 'మండలాన్ని' పూజిస్తారు.

వజ్రయాన బౌద్ధులు పూజించే మండలాలలో ప్రధానమైనది 'గర్భదత్తు మండలం'. ఇందులో బుద్ధుడు మధ్యలోఉండగా ఇతర ఉప బుద్ధులు లేదా బుద్ధుడి గత జన్మల అవతారాలు అయిన బోధిసత్వులు ఎనిమిదిమంది ప్రధాన బుద్ధుడుకి అన్నివైపులా ఉంటారు. 'కాలచక్ర మండలం' అనేపేరుగల ఇంకో మండలం కూడా ఉన్నది. ఈమధ్య గుంటూరులో (ఆంధ్రప్రదేశ్) జరిగిన కాలచక్ర ఉత్సవాలు ఈ కాలచక్రమండలాన్ని పూజించాయి. దలైలామా మరియు ఇతర వజ్రయాన బౌద్ధ సన్యాసులు ప్రపంచం నాలుగు మూలల నుండి వచ్చి ఈ కాలచక్ర ఉత్సవాలకి హాజరు అయినారు. కాలచక్ర

మండలంలో నాలుగు భాగాలుంటాయి. వజ్రయాన తంత్ర విధానంలో కొన్ని సాధనాలను ఉపయోగిస్తారు. అవి ఏమిటో క్లుప్తంగా తెలుసుకుందాం.




**ఫోటో : 1. గంట 2. వజ్రాయుధం 3. డమరుకం**

ఇందులో 'గంట' ప్రధానమైనది. వజ్రయాన తాంత్రిక యోగులు పూజలు చేస్తున్నపుడు ఈ గంటనుపయోగిస్తారు. ఏవైనా దుష్టశక్తులు ఈ పూజలు జరిగే ప్రదేశం దగ్గరలో ఉండకుండా ఉండేందుకు ఈ గంటని ఉపయోగిస్తారు.

మొత్తంగాచూస్తే పైన పేర్కొన్న వస్తువులు బుద్ధుడికి చిహ్నంగా భావిస్తారు. గంట బుద్ధుడి వాక్‌కి చిహ్నం. వజ్రయుధం బుద్ధుడి మేధస్సుకి చిహ్నం. ఇతర బౌద్ధమత శాఖలలోని ప్రాణాయామ యోగంలో భాగం అయిన 'హఠయోగం' ఈ వజ్రయానంలో కనిపిస్తున్నది. హిందూమతప్రభావంవల్లే వజ్రయానం బౌద్ధంలో మంత్రాలు, తంత్రాలు మరియు యంత్రాలు ఏర్పడ్డాయి.

## 18. కపాలికులు ఎవరు వారి చరిత్ర ఏమిటి ?

కపాలికుడు అంటే కపాలాన్ని వెంట తీసుకువెళ్ళేవాడు అనిఅర్థం. ఇది శైవానికి చెందిన ఒక తాంత్రికవర్గం. మధ్యయుగ హైందవ చరిత్రలో కపాలికులకు ప్రముఖస్థానం ఉన్నది. క్రీ.శ. 5 నుండి 13వ శతాబ్దిదాకా కపాలిక తాంత్రిక వర్గం భారతదేశంలో ప్రముఖంగా ఉండేది. అయితే వీరి తీవ్ర ఆరాధనా విధానాల వల్ల వీరికి నాగరిక సమాజంలో అల్పస్థానం ఉండేది. వీరినిచూసి ప్రజలు చాలా భీతిచెందేవారు. వీరి పూజావిధానాలలో మద్యం సేవించటం, గంజాయి, భంగులాంటివి పీల్చటం, మాంస భక్షణం కొన్నిసార్లు నరమాంస భక్షణచేయటం, వికృతమైన శృంగారకేళి జరపటంవంటి అతి తీవ్ర విధానాలు ఉండటంవల్ల నాటి ప్రజలు వీరి మార్గాన్ని ఆదరించే వారుకాదు.

వీరిని గురించిన సమాచారం అందించే ఆధారాలు చాలా అల్పంగా లభిస్తున్నాయి. కనీసం వీరైనా తమ మార్గం గురించిన గ్రంధాలను వెలువరించలేదు. అయితే హైందవ గ్రంధాలలో అప్పుడప్పుడూ వీరిని గురించిన ప్రస్తావనలు కనిపిస్తాయి. దక్షిణభారతదేశం లేదా దక్కన్ పీఠభూమి ప్రాంతంలో వీరు అధికంగా ఉండేవారని తెలుస్తున్నది. 8వ శతాబ్ది ప్రారంభకాలంలో కంచి, మైసూర్, పశ్చిమ, మధ్య మహారాష్ట్ర, ఉజ్జయిని మరియు ఆంధ్రప్రాంతాలలో కపాలికులు ఉండేవారు. కపాలికుల వివరాలను అందించిన తర్వాతికాల వివరాల ప్రకారం వీరు గుజరాత్, బుందేల్‌ఖాండ్, వింధ్య పర్వత ప్రాంతాలలో నివశించినట్లుగా తెలుస్తున్నది. తొమ్మిదవ శతాబ్ది తర్వాత అందిన వివరాల ప్రకారం కపాలికులు ఉత్తరభారతదేశంలో అనగా ఉత్తరప్రదేశ్, బీహార్, పంజాబ్, పశ్చిమ పాకిస్తాన్ మరియు కాశ్మీర్‌లలో నివశించినట్టుగా తెలుస్తున్నది. 14వ శతాబ్దం ప్రవేశించే సరికి కపాలికులు భారతదేశంలో ఉన్న వివిధ తాంత్రిక వర్గాలలో విలీనం అయిపోయారు. నేటికీ కొందరు కపాలికులు ఉత్తర బెంగాల్‌లోనూ మరియు అస్సాం రాష్ట్రంలోనికొన్ని ప్రాంతాలలో ఉన్నారని తెలుస్తున్నది.

అసలు కపాలికులు అనే మాంత్రిక వర్గం ఎలా ఏర్పడింది. అన్న ప్రశ్నకు సమాధానంగా ఇలా చెప్పవచ్చు. అదేమిటంటే 'గోరక్ష-సిద్ధాంత- సంగ్రహం' అనే గ్రంధంలో ఇలా చెప్పబడింది. ఒకానొకకాలంలో శ్రీమహా విష్ణువుయొక్క 24 అవతారాలు ద్రాక్షసారాయి త్రాగి ఉన్మత్తులై, ప్రపంచంపై విరుచుకుపడి సామాన్య ప్రజల్ని, ఋషుల్ని మరియు దేవతల్ని సంహరించటం మొదలయిందట. విష్ణు అవతారాలలో ఉగ్రమైన వరాహ మరియు నారసింహ మరియు పరశురామ అవతారాలు తీవ్ర హింసాకాండకి పాల్పడ్డాయట. శ్రీకృష్ణా వతారం కామ సంబంధ భావాలతో తల్లడిల్లిపోయాడట. ఇలా విష్ణు అవతారాలు విజృంభించేసరికి, ప్రజల్ని, జీవుల్ని రక్షించ టానికి శివుని నుండి 24 మంది కపాలికులు ఆవిర్భవించి, 24 విష్ణు అవతారాలతో భీకర యుద్ధంచేసి, ఒక్కో కపాలికుడు, ఒక్కో విష్ణావతారం యొక్క తలని ఖండించి, ఆ తలలో ఉండే మాంసాన్ని అవతలపారవేసి, కపాలాన్ని చేత్తో పట్టుకొని వెళ్ళారట. కపాలికులచేతిలో భంగపడ్డ 24 విష్ణుఅవతారాలకు గర్వభంగం అయి పశ్చాత్తాపపడటంలో ఆ అవతారాలకు వాళ్ళ తలలు మళ్ళీ వచ్చాయట. ఈ పురాణంలో బ్రాహ్మణసంప్రదాయ మంత్రమార్గానికి కపాలికుల తంత్రమార్గానికి మధ్యగల ద్వేషం విరోధిస్పష్టంగా కనిపిస్తున్నది.

తమ పుట్టుపూర్వోత్తరాలు, చరిత్ర గురించి వివరించే ఏగ్రంథాన్నీ కపాలికులు తయారుచేయలేదు. కానీ ఆనాటి కథలు నాటకాలలో కపాలికుల పాత్రలు కన్పించాయి. ఆనాటక, కథా రచయితలు, ఆనాటి కపాలికుల ఆచార వ్యవహారాలను గురించి వర్ణించారు. కపాలికులు క్షుద్ర మాంత్రికులుగా, విదూషక లక్షణాలుగల దుర్మార్గులుగా (comedy / comicalvillains) అభివర్ణించబడ్డారు. కపాలకుల గురించి చాలా వివరాలను తెలుపగల గ్రంథం (శంకరదిగ్విజయం". శంకరాచార్యుడు శైవమతాన్ని ప్రచారంచేస్తున్నకాలంలో ఉగ్రభైరవుడు అనే కపాలికుడు ఉండేవాడు. అతడు ఆదిశంకరాచార్యను కలిసి, భైరవునికి ఒక మహారాజునిగానీ, ఒక మహాయోగినికానీ బలి ఇవ్వాలను కుంటున్నానని చెప్పి, శంకరాచార్యను బలి ఇవ్వటానికి ప్రయత్నించాడు. అప్పుడు శంకరాచార్య 'లక్ష్మీనరసింహమమదేహి కరావలంబం' అంటూ శ్రీనృసింహస్వామి పిలిచేసరికి అక్కడ ఉగ్రనరసింహుడు ప్రత్యక్షమై కపాలికుడ్ని అతని శిష్యుల్ని అంతంచేసాడట. పల్లవరాజు మహేంద్రవర్మ వ్రాసిన మత్తవిలాసం, భవభూతి వ్రాసిన 'మాలతీ-మాధవం' కృష్ణమిశ్రుడు వ్రాసిన "ప్రబోధ చంద్రోదయం" ఇంకొకనాటకం "చండకేశిక" 'కపాలికులు' ప్రధాన పాత్రలుగా గల నాటకాలు అని తెలుస్తున్నది. ఈ నాటకాలలో నాటి కపాలికుల దురహంకారం, దుర్మార్గం, ఇతరుల్ని హింసించి ఆనందంపొందే రాక్షస స్వభావాలు స్పష్టంగా వివరించబడ్డాయి. కపాలికులు స్త్రీలను అపహరించితెచ్చి, వారిని పూజలల వినియోగించి, ఆపై వారిని హింసించి, అనుభవించి చంపేవారట. ఇలా చేయటంవల్ల మానవాతీత శక్తులు వస్తాయని వారినమ్మకం.

కపాలికులు ఇష్టదైవం భైరవుడు. ఈయన సృష్టి, స్థితి లయకారుకుడు అని కాపాలికులు విశ్వసిస్తారు. భైరవుడు సమస్త వేవతలకు ప్రభువని కపాలికులు విశ్వశించారు. భైరవుడ్ని తృప్తి పరచటానికి నరబలి మరియు జంతు బలులు వచ్చేవారు. వీరు నరబలిగా వచ్చేవాడు నీతివంతుడు, పరిశుద్ధుడు, ఉత్తముడు అయి ఉండాలి. అట్టి మానవుడు లభ్యం అయినపుడు అతన్ని భైరవుడికి బలిఇచ్చి, అతని తలను మరియు మద్యాన్ని భైరవుడికి నైవేద్యంగా ఉంచుతారు. కొన్నిసార్లు భైరవుడి రక్తదాహాన్ని తీర్చటానికి తమను తామే బలిఇచ్చుకోవటంకూడా జరిగేది. ఎవరైనా వేద పండితుడు అయి బ్రాహ్మణుడిని బలిఇస్తే, బ్రహ్మహత్యాదోషం అంటితే, అందుకు పరిహారంగా 'మహావ్రతం' అనేపేరుగల కఠిన నియమాలు ఈ కపాలికులు పాటించారు. ఆ నియమాలు ఏమిటంటే

1. అరణ్యంలో గుడిసెవేసుకొని జీవించుట.
2. రోజుకి మూడుసార్లు స్నానంచేయుట.

3. గ్రామాలలో ఇల్లిల్లు తిరిగి బిచ్చం ఎత్తి ఆకలి తీర్చుకోవటం.

4. ఉత్త గడ్డిపై నిద్రించుట.

5. తాను ఏ బ్రాహ్మణుడిని చంపాడో, ఆ బ్రాహ్మణుడి కపాలాన్ని 12 సంవత్సరాలు పాటు వెంటపెట్టుకొని తిరగాలి.

6. కుక్క లేదా గాడిద చర్మాన్ని వస్త్రంగా ధరించాలి. ఇలాంటి కఠిన నియమాలు పాటించి తాము చేసిన ఘోర పాపాల నుండి విమోచన పొందిన కపాలికులకు అతీంద్రియశక్తులు వస్తాయని విశ్వసించబడింది. ఒకసారి బ్రహ్మదేవుడి శిరస్సును ఆగ్రహంతో ఖండించిన శివుడుకూడా, బ్రహ్మహత్యాదోషాన్ని క్షాళనంచేసుకోవటానికి బ్రహ్మయొక్క కపాలంలో 12 సంవత్సరాలపాటు బిక్షాటనచేసాడని పురాణాలలో చెప్పబడి ఉన్నది.

అందువల్లే శివుడికి కపాలేశ్వరుడు అన్నపేరువచ్చింది. కపాలికులు మద్యం సేవించి, నరమాంసం భక్షించి, దైవం ముందు సంపర్కం జరుపుతారు. అలా దైవం ముందు శృంగారం జరిపే కపాలికుడు తనని శివుడిగా, తనతో ఉన్న స్త్రీని పార్వతిగా భావిస్తాడు. అలా జరిపే శృంగారం వల్ల శివానుగ్రహం కలుగుతుందని కపాలికులు విశ్వసిస్తారు.

కపాలికుల ఆరాధ్యదైవం అయిన భైరవుడు ఆవిర్భవించిన కథచాలా ఆశ్చర్యకరంగా ఉంటుంది. ఒకసారి సృష్టికర్త అయిన బ్రహ్మదేవుడి తన మనస్సు నుండి ఒక అందాల రాశిని సృష్టించాడు. ఆమెను ఎల్లవేళలా చూడటానికి వీలుగా తనకి నాలుగు తలలు ఉండేలా చేసుకున్నాడు. తన మానసపుత్రికను కామించిన బ్రహ్మ ఆమెతో రమించాలని ప్రయత్నించగా, ఆమె ఊర్ధ్వలోకాలకి (బ్రహ్మలోకంపైన ఉన్నలోకాలకి) పరిగెత్తింది. అప్పుడు బ్రహ్మపైకి చూడటానికి ఐదవ శిరస్సును సృష్టించుకున్నాడు. పైకి వెళ్తున్న తన పుత్రికను చూస్తున్నాడు, ఇదంతా చూస్తున్న ఈశ్వరుడికి ఆగ్రహం వచ్చింది. దాంతో ఆయన భైరవుడ్ని సృష్టించాడు. ఆ భైరవుడు, కామాగ్నిలో దహించుకుపోతున్న బ్రహ్మదేవుడి ఐదవ తలను బొటన వ్రేలి గోరుతో గిల్లివేసాడు. అప్పుడు బ్రహ్మదేముడికి వివేకం ఉదయించింది. అంతవరకూ బాగానేఉంది. భైరవుడు ఖండించిన బ్రహ్మశిరస్సు భైరవుడి చేతికి అంటుకుపోయింది. అంటే భైరవుడికి బ్రహ్మహత్యాదోషం చుట్టుకుందన్నమాట. ఈ పాపాన్ని వదుల్చు కోవటానికి బ్రహ్మయొక్క కపాలంలో కొంతకాలంపాటు బిక్షాటనచేసాడు భైరవుడు.

# 19. రత్నధారణ నిజంగా ఫలితాలను ఇస్తుందా?

రత్నధారణ కేవలం అందానికేకాక, గ్రహాల అనుగ్రహాన్ని పొందటానికి కూడా ఉపయోగించబడుచున్నాయి. అయితే గ్రహాలయొక్క శుభదృష్టిని ఇవ్వగలిగేశక్తి ఈరత్నాలకి ఉన్నదా అని చాలామంది ప్రశ్నిస్తూ ఉంటారు. ఈ ప్రశ్నకు సరిఅయిన సమాధానం చెప్పటం అంతసులువుకాదు. ఎందుకంటే ఏఏ వ్యక్తులు ఏఏ రత్నాల్ని ధరిస్తే అనుకూల ఫలితాలు వస్తాయి అని ఖచ్చితంగా నిర్ణయించి చెప్పగల జ్యోతిష పండితులు చాలా తక్కువమందే ఉన్నారు. రత్నాలు నిజమైనవి లభించటం చాలాకష్టం. ఒకవేళ మేలురకం రత్నాలు లభించినా వాటి ఖరీదు చాలా ఉంటుంది.



ఫోటో : కపాలిక

నవరత్నాలు అని పేర్కొనబడుతున్న కెంపు, ముత్యం, పగడం, పచ్చ, కనక పుష్యరాగం, వజ్రం, నీలం అనేరాళ్ళు (ఇందులో ముత్యం మరియు పగడాలు రాళ్ళు కాదు జీవ సంబంధ పదార్థాలు) నవగ్రహాలకు చిహ్నాంగావాడబడుచున్నాయి. రత్నాలు మనుషులపై ప్రభావం ఎలా చూపిస్తాయి అన్న ప్రశ్నకు సమాధానం ఇలా చెప్పవచ్చు.

జీవితంలో ఘన విజయాలు సాధించిన వారికి, సంపన్నులకు వారి జాతకంలో గురుగ్రహ అనుగ్రహం అపారంగా ఉంటుంది. గురువు భాగ్యకారకుడు కావున వీరందరూ భాగ్యవంతులు అవగలిగారు. ఇక గురువుయొక్క రంగు నీలం (blue). ఎవరి జాతకంలో అయినా గురువు బలహీనంగా ఉండి, అపజయాలు, నష్టాలు, పరాభవాలు పొందుతున్నప్పుడు గురుగ్రహ అనుగ్రహానికి కనకపుష్యరాగం లేదా శ్వేతపుష్యరాగం ధరించాలి. తెలుపు లేదా బంగారం రంగులో ఉండే ఈ పుష్యరాగాలు నీలిరంగు కాంతి తరంగాల్ని ప్రసరిస్తాయి. ఈ రత్నాల్ని ధరించిన వారిపై గురుగ్రహ సంబంధమైన నీలిరంగు తరంగాలు ప్రసరించి వారిపై గురుగ్రహ శుభ దృష్టిని ప్రసరింపచేస్తాయి. ఆవిధంగా వారి జాతకంలో బలహీనంగా ఉన్న గురువు బలవంతుడైన వారికి శుభ, సౌఖ్యాలు ప్రసాదిస్తాడు.

ఇక గ్రహాలలో అతిశక్తి వంతుడైనవాడు శని భగవానుడు. ఈయన ప్రసరించే కాంతి తరంగాలు వంగపండు (Voilet) లో ఉంటాయి. శని వయస్సుకి,

వృత్తికి, ఉద్యోగాలకి కారకుడు. శని బలహీనంగా ఉన్న జాతకాల వారికి ఉద్యోగాలలో స్థిరత్వం ఉండదు. గొడ్డుచాకిరీచేసినా కడుపునిండటమేకష్టం అవుతుంది. ఇక శని బలంలోపించిన వారుచేసే వ్యాపారాలు ఎంతకాలం గడిచినా వృద్ధిచెందవు. వారి దుకాణాలలో దొంగలు పడటం, అగ్ని ప్రమాదాలు జరగటం లాంటి అవాంఛనీయ సంఘటనలు జరిగి నష్టాలు రావటం జరుగుతుంది. ఇలాంటి పరిస్థితులలో 'శని' అనుగ్రహం పొందటానికి నీలం లేదా ఇంద్రనీలం ధరించాలి. ఈ రత్నాలనుండి శనిగ్రహ చిహ్నాం అయిన వంగపండు రంగు (Voilet) కాంతి ప్రరిస్తుంది. అందువల్ల 'శని' అనుకూల దృష్టులు, ఆరత్నాన్ని ధరించిన వారిపైపడి వారి కష్టాలు తీరి సౌభాగ్యం పొందుతారు. ఈవిధంగా రత్నధారణచేసి గ్రహాల్ని శక్తివంతంచేసి శుభాలు పొందవచ్చు. తమకు కావాల్సిన రత్నాన్ని ధరించినవారు, ఆ రత్నంయొక్క స్పర్శ తమ చర్మానికి తగిలేలా ఉంగరాలు తయారుచేయించు కోవాలి. అప్పుడే సంబంధిత రత్నం ప్రసరించేకాంతి తరంగాలు ఆయావ్యక్తులకు అందుతాయి.

ఇంద్రనీలం చాలాశక్తి వంతమైన రత్నం. అది నిజంగా అవసరమైన వాళ్ళే ధరించాలి. సరదాకో లేదా మిడి, మిడిజ్ఞానం ఉన్న జ్యోతిష్కుడి సలహాపైనో దాన్ని ధరిస్తే, అలా ధరించిన వాడిని దేముడుకూడా రక్షించలేడు.

రత్నాల్ని కేవలం ఉంగరాల ద్వారానేకాకకుండా, చెవులకి చేయించుకునే ఆభరణాలకు, కంకణాలకు (Bracelets) మెడలో ధరించే గొలుసులకికూడా అమర్చి ధరించవచ్చు. అతి ప్రాచీనకాలం నుండి రత్నాలకు ఎనలేని విలువ ఉన్నది. రత్నాలకి అపారమైన అతీంద్రియ శక్తులున్నాయన్న నమ్మకం ప్రపంచవ్యాప్తంగా ఉన్నది.

ఒకరి జాతకంలో ఏ గ్రహం బలహీనంగా ఉంటే ఏఏ ఫలితాలు కలుగుతాయి, ఏఏ రత్నాలు ధరిస్తే ఆ దోషాలు పోయి బలహీన గ్రహాలు బలపడతాయి అన్న విషయాలను క్రింద వివరిస్తున్నాం.

1. సూర్యగ్రహం బలహీనంగా ఉంటే బిడ్డలు మాట వినరు. సమాజంలో స్థానం హీనంగా ఉంటుంది. ప్రభుత్వపరంగా చిక్కులు రావటం జరుగుతుంది. ఇట్టి సమస్యలున్నవారు సూర్యుని చిహ్నాం అయిన కెంపు (Ruby) ని కనీసం 3 కారెట్లది అయినా ధరించాలి. దీని తొలిసారి ఆదివారంనాడు ధరించాలి. వీలు దొరికితే క్రింది బీజ మంత్రము రోజుకి 28సార్లు జపిస్తే, కెంపు ధరించిన వారికి మరింత మేలు జరుగుతుంది.

**॥ ఓం అం ఆం హ్రీం శ్రీం శ్రీం మర్తాండాయ స్వాహా॥**

2. చంద్ర గ్రహబలం లోపిస్తే స్త్రీలకు బహిస్టు సంబంధ రోగాలు వస్తాయి. తరచుగా గర్భస్రావాలు అవుతాయి. ఇంకా ఈ గ్రహబలం లోపించిన వారికి మనశ్శాంతి ఉండదు. ఏంమాట్లాడినా తగాదాలు అవుతాయి. ఇట్టి దుష్ఫలితాలు పొందుతున్నవారు ముత్యాన్నిగానీ, చంద్రకాంత శిల (moon stone) ను గానీ వెండి ఉంగరంలో ధరిస్తే, వీరి సమస్యలు పరిష్కారం అవుతాయి. ఈ రత్నాన్ని / ముత్యాన్ని సోమవారం తొలిసారి ధరించాలి. అవకాశం ఉంటే ఈ క్రింద ఇచ్చిన చంద్రగ్రహ బీజ మంత్రాన్ని రోజుకి 20సార్లు జపిస్తే, ధరించిన రత్నంయొక్క శక్తి మూడురెట్లు పెరిగి మరింత శుభ ఫలితిలు వస్తాయి.

**॥ ఓం శ్రీం శ్రీం శ్రౌం సః చంద్రాయ నమః ॥**

3. కుజగ్రహం బలహీనంగా ఉంటే కోర్టుకేసుల్లో, తగాదాల్లో వివాదాలలో ఇరుక్కోవటం జరుగుతుంది. స్త్రీ, పురుషులకి ఎంత వయస్సు వచ్చిన పెళ్ళిళ్ళుకావు. దంపతులకు మధ్య సఖ్యత లేక 'పాము – ముంగిసల' లాగా ఎప్పుడూ పోట్లాడుకుంటూ ఉంటారు. ఇలా కుజగ్రహం బలహీనంగా ఉన్నవారు 'పగడం' ధరిస్తే వారి సమస్యలు తీరి సుఖంగా ఉంటారు. ఉంగరంలో అమర్చిన పగడం మహాశ్రేష్టం. పగడధారణ చేసిన వారు వీలు దొరికితే క్రింద ఇచ్చిన కుజగ్రహ బీజ మంత్రాన్ని రోజుకి 27సార్లు జపిస్తే రెట్టించిన శుభాలు పొందటం ఖాయం. పగడం తొలిసారి మంగళవారం నాడు ధరించాలి.

**॥ ఓం హాం హాం సః ఖాం ఖః అంగారకాయ నమః ॥**

4. బుధ గ్రహం బలహీనంగా ఉంటే నత్తి, మాటలు సరిగా రాకపోవటం, సభాకంపం (Stage fear) కలిగి ఉండటం, దయాబెటీస్, కిడ్నీ సంబంధ వ్యాధులు ఉండటం, పిల్లలకి చదువు సరిగ్గా రాకపోవటం, పరీక్షల్లో ఉత్తీర్ణత కాకపోవటం లాంటి సమస్యలు కలుగుతాయి. ఇట్టి సమస్యలున్నవారు బుధగ్రహ అనుగ్రహాన్ని సంపాదించటానికి పచ్చను ధరిస్తే, మంచి ఫలితాలు వస్తాయి. పచ్చను తొలిసారిగా బుధవారంనాడు ధరించాలి. కాస్త తీరిక సమయం ఉన్నవారు క్రింద ఇచ్చిన బుధగ్రహ సంబంధ బీజమంత్రాన్ని రోజుకి 14సార్లు జపిస్తే, ఆ రత్న ప్రభావం ఐదురెట్లు పెరిగి మరింత ప్రయోజనం కలుగుతుంది.

**॥ ఓం బ్రాం బ్రీం బ్రౌం సః బుధాయ స్వాహా ॥**

5. గురువు ఎవరిజాతకంలో అయినా బలహీనంగా ఉంటే క్రింది ఫలితాలు కలుగుతాయి. పరాజయాలు అధికం అవుతాయి. చేతిదాకా వచ్చినవి చేజారిపోతాయి. తీసుకున్న ఆహారం రోగాలు ఇస్తుంది. విరోధాలు పెరుగుతాయి. గురువును బలవత్తరం చేసే కనకపుష్యరాగం / శ్వేతపుష్యరాగం ధరిస్తే కీడుతొలగి మేలుజరుగుతుంది. పుష్యరాగం తొలిసారిగా ధరించే వాళ్ళు గురువారంనాడు ధరించాలి. కాస్త అవకాశం ఉన్నవారు క్రింద ఇచ్చిన బీజ మంత్రాన్ని రోజూ పఠిస్తే వారు ధరించిన 'పుష్యరాగం' మరింత మంచి ఫలితాలను ఇస్తుంది. ఈ మంత్రాన్ని రోజుకి 30సార్లు జపించాలి.

**॥ ఓం ప్రాం ప్రీం ప్రౌం బృహస్పతయే నమః ॥**

6. శుక్రగ్రహం ఎవరి జాతకంలో అయినా బలహీనంగా ఉంటే కురూపులుగా జన్మిస్తారు. తొందరగా పెద్దవాళ్ళు అయిపోయి ముసలి రూపు వస్తుంది. పురుషులకు శుక్రగ్రహం బలహీనంగా ఉంటే శృంగార జీవితం నిస్సారంగా ఉంటుంది. అదే స్త్రీలకు శుక్రబలం లోపిస్తే, భర్త ఆదరణ కరువు అగును. శుక్రగ్రహం బలవత్తరం కావాలంటే తెలుపు లేదా ఎరుపు రంగు వజ్రాన్ని ధరించాలి. శుక్రగ్రహబలం మరింత అధికం కావాలంటే క్రింద ఇచ్చిన బీజమంత్రాన్ని రోజుకి 24సార్లు జపించాలి. అన్నట్టు తొలిసారి వజ్రాన్ని శుక్రవారంనాడు ధరించాలి.

**॥ ఓం ఏం జం గేం గ్రహేశ్వరాయ శుక్రాయ స్వాహా ॥**

7. శనీశ్వరుడు గ్రహాలలో మహాశక్తివంతుడు తిమ్మిని బమ్మిని చేయగల సమర్థుడు శనీశ్వరుడు. ఆయన బలంలోపించిన జాతకులకు క్రింది ఫలితాలు వస్తాయి. ఉద్యోగాలు రావు వచ్చినా నెలకోఉద్యోగం మారతారు. చేసే వృత్తుల్లో, వ్యాపారాల్లో నష్టమే తప్ప లాభంరాదు. అపవాదులు, సమస్యలు – అవమానాలు చుట్టుముడతాయి. శనిబలం లోపిస్తే అకాల మరణాలు కలుగుతాయి. ఎవరి జాతక చక్రములో ఐనా లగ్నంలో శని ఉంటే లేదా రాహువు ఉంటే వారికి దయ్యా కనిపిస్తాయి అని జ్యోతిషశాస్త్రం చెబుతున్నది. శనిబలం అల్పంగా ఉన్నజాతకులు నీలాన్నిగానీ, ఇంద్ర నీలాన్నిగానీ ధరించాలి. తొలిసారి నీలాన్ని ధరించేవారు, ఆరత్నాన్ని శనివారం ధరించాలి. అవకాశం ఉంటే క్రింద ఇచ్చిన బీజమంత్రాన్ని రోజుకి 8సార్లు జపిస్తే, శనిబలం మరింత అధికమయి, మరిన్ని శుభ ఫలితాలు కలుగుతాయి.

**॥ ఓం ప్రీం నమః పంగుపాదాయ సూర్యసూనవేస్వాహా ॥**

8. గ్రహాలలో సర్పగ్రహం, పాపం గ్రహం అని భావించ బడుచున్న గ్రహం రాహుగ్రహం. ఎవరైనా అకస్మాత్తుగా సంపదలు, పదవులు పొందితే

అందుకు కారణం రాహుగ్రహం వారి జాతకాల్లో బలంగా ఉంటుంది అని అర్థం. లంచాలు తెగమెక్కి కోటీశ్వరులు అయిన ప్రభుత్యోగులు, కల్తీ సరుకులు అమ్మి, దొంగ లెక్కలువ్రాసి లక్షాధికారులు అయ్యే వ్యాపారస్తులు జనాల్ని ఊచకోత కోయించి, దొంగ ఓట్లు వేసుకొని పదవులు పొందే నాయకులు కేవలం రాహుగ్రహ ప్రభావం అధికంగా ఉండటంవల్లే గొప్ప వాళ్ళు అవుతున్నారు. అంటే రాహుబలం వల్ల అక్రమ మార్గాలలో పైకి వస్తారని తెలుస్తున్నదికదా! 70 సంవత్సరాలు దాటిన స్త్రీ, పురుషులకి రాహుదోషం ఉండదు. అలాగే 7 సంవత్సరాలలోపు పిల్లలకి రాహుదోషం ఉండదు. అని తెలుసుకోవాలి. ఎవరి జాతకంలో అయినా రాహు గ్రహబలం తగ్గితే క్రింద చెప్పబడిన ఫలితాలు వస్తాయి. గృహంలో లేదా దుకాణాల్లో చోరుల వలన నష్టం వస్తుంది. సంతానం అకాల మరణాలకు, ఘోర ప్రమాదాలకు గురి అవుతారు. నీచులతో, జారులతో స్నేహాలు కలుస్తాయి. అకారణంగా పోలీసు కేసుల్లో ఇరుక్కుని జైలుపాలు అవుతారు. చర్మవ్యాధులు వస్తాయి. కేన్సర్, ఎయిడ్స్ లాంటి ప్రాణాంతక రోగాలు వస్తాయి. ఇలా రాహువు పీడ కలిగే వారు రాహువుయొక్క శుభదృష్టి పొందటానికి గోమేధికం ధరించాలి. తొలిసారిగా గోమేధికం ధరించేవారు, ఆ రత్నాన్ని 'శనివారం' నాడు తొలిసారి ధరించాలి. కాస్త సమయం లభిస్తే ఈ క్రింద ఇచ్చిన బీజ మంత్రాన్ని రోజుకి 13 సార్లు జపిస్తే, రాహుగ్రహ ప్రతిరూపం అయిన గోమేధికం అధిక ఫలితాల్ని ఇస్తుంది.

**॥ ఓం భ్రాం భ్రిం భ్రౌం రాహవే నమః ॥**

9. సర్పగ్రహమైన కేతువు మోక్షకారకుడు. కేతుగ్రహబలం లోపిస్తే మానసిక సంబంధ రోగాలు వస్తాయి. అంగవైకల్యం వస్తుంది. సంతానలేమి, సంతాననష్టం కల్గించేది ఈ కేతుగ్రహమే. జీవితంపై విరక్తి, ఉదర సంబంధ రోగాలు కల్గించేది ఈ సర్ప గ్రహమే. ఎవరి జాతకంలో అయినా కేతుగ్రహ బలం లోపిస్తే, వైఢూర్యాన్ని ధరించాలి. తొలిసారి వైఢూర్యాన్ని ధరించేవారు. ఆ రత్నాన్ని గురువారంనాడు ధరిస్తే మంచిది. తీరిక సమయం ఉంటే క్రింది ఇస్తున్న కేతు సంబంధ బీజ మంత్రాన్ని 21సార్లు రోజూ జపిస్తే 'వైఢూర్యం' మరింత శుభాన్ని కలిగిస్తుంది.

**॥ ఓం ఐం హ్రీం క్రైం కేతవేనమః ॥**

పైన పేర్కొనబడినట్లుగా గ్రహ దోషాలున్నవారు ఆయా గ్రహ సంబంధ రత్నాలను ధరిస్తే మేలు జరుగుతుంది. రత్నాలు మేలు రకమయినవి ధరిస్తే ఫలితాలు ఖచ్చితంగా వస్తాయి. కల్తీ మందులు వాడితే రోగాలు తగ్గవు. అలాగే అసలు రత్నాలు వాడితేనే శుభాలు కలుగుతాయి.

# ౨౦. మానవుల రక్తంతాగే డ్రాకులాలు నిజంగా ఉన్నారా?

'రక్తపిశాచి' (డ్రాకులా) అనే మాట చాలామంది వినేఉంటారు. బీభత్స, భయానక సాహిత్యంలో రారాజు డ్రాకులా అని చాలామంది విద్యాధికులకి తెలుసు. అనేక ఇంగ్లీష్ సినిమాలలో, చివరికి భారతీయ సినిమాలలో కూడా డ్రాకులాపై సినిమాలు వచ్చాయి. అయితే నిజంగా 'డ్రాకులా' అనే పైశాచికశక్తి ఉన్నదా లేదా అన్న విషయం అటు ప్రక్కనపెట్టి, ఇంకా ప్రపంచంలో ఏఏ దేశాలలో 'డ్రాకులా'ను పోలిన రక్త పిశాచులు (మానవుల రక్తంతాగి జీవించే దయ్యాలు) ఉన్నాయో తెలుసుకుంటే చాలా ఆశ్చర్యం కలుగుతుంది. ఆ వివరాలు క్లుప్తంగా తెలుసుకుందాం.



ప్రపంచంలోని కొన్ని దేశాలలో రక్త పిశాచులు ఆడవి (Femele vanpires) కావటం విశేషం. (అన్నట్టు మానవుల రక్తాన్ని కేవలం ఆడదోమలే త్రాగుతాయి) అరేబియా లేడీ డ్రాకులాను అల్‌గుల్ (Al Gul) అంటారు. ఫిలిప్పైన్స్ దేశ లేడీ డ్రాకులాను డనాగ్ (Danag) అంటారు. రష్యాదేశంలో లేడి డ్రాకులా పేరు ఎరిటికా (Eretica) ఐరిష్ (బ్రిటన్) లేడీ డ్రాకులాపేరు లీనేహాహ–షి. స్కాటిష్ (బ్రిటన్) లేడీ డ్రాకులా పేరు బావభన్–సిత్ (Baobhan-sith) మలేషియా లేడీ డ్రాకులాపేరు లాంగ్‌సూర్, లిబియాదేశ లేడీ డ్రాకులా లామియా. ప్రపంచంలో ఒక మగ డ్రాకులా మాత్రమే ఉండగా, ఇతర దేశాలలో ఆడ డ్రాకులాలు ఉన్నారు.

# 21. హాలోవిన్ అంటే ఆత్మల దినమా?

హాలోవిన్ (Holloween day) అనే రోజు కొన్నివేల సంవత్సరాల నుండి పాశ్చాత్య దేశాలలో జరుపుకుంటున్న ఒక సెలవుదినం. అయితే విభిన్న పాశ్చాత్య సంస్కృతులలో వేర్వేరు పేర్లలో ఈ రోజు జరుపుకుంటున్నారు. రోమన్లు 'పోమానాడే' అనీ, సెల్టిక్ జాతివారు 'షాహిన్‌డే అనీ, క్రైస్తవులు "ఋషుల మరియు ఆత్మలదినం" (All souls day) ఈ రోజుని పిలుస్తున్నారు.

ఈనాడు గ్రేట్ బ్రిటన్ అని పిలువబడుతున్న ప్రాంతంలోనూ, ఉత్తర ఫ్రాన్స్‌లోను ఒకనాడు జీవించిన సెల్టిక్ (celtic) జాతి ఈ హాలోవిన్ దినాన్ని ప్రారంభించారు. సెల్టిక్ జాతివారు ప్రకృతిని ముఖ్యంగా సూర్యుడిని ఆరాధించేవారు. సూర్యుడివల్లే పంటలు పండుతున్నాయని, సూర్యుడి వల్లే ఈ భూమిపై ప్రకృతి మనగలుగుతున్నదనీ, సెల్టిక్‌లు విశ్వశించేవారు. నవంబర్-1వ తేదీన వారి నూతన సంవత్సరం ప్రారంభం అవుతుంది. నవంబర్ ఒకటి నుండి సూర్యుడి ప్రభావం తగ్గి, చీకటి మరియు చలి ప్రభావం పెరుగుతుంది. అందువల్ల సూర్యుడికి వీడ్కోలు ఇస్తూ ఈ హాలోవిన్ రోజుని ఒక సెలవు దినంగా, పండుగదినంగా సెల్టిక్ జాతివారు భావించేవారు.



**హాలోవిన్ మాస్క్**

అక్టోబర్ 31కి అన్ని పంటలు కోయబడి ఇళ్ళకి చేరేవి. సెల్టిక్ పూజారులు, సమస్త సెల్టిక్ ప్రజల్ని తీసుకొని, కొండపై ఉన్న ఓక్‌చెట్ల అడవికి వెళ్ళేవారు. సెల్టిక్ జాతివారు ఓక్ వృక్షాన్ని పవిత్రంగా భావిస్తారు. ఆ ఓక్ చెట్ల క్రింద మంట వెలిగించి క్రొత్తగా వచ్చిన పంటను ఉపయోగించి చేసిన వంటకాల్ని, జంతువుల్ని చెట్లకు బలిఇచ్చి ప్రార్ధనలుచేసేవారు. (కార్తీకమాసంలో హిందువులు ఉసిరిగ చెట్లక్రింద వనభోజనాలు చేస్తారు. అదే విధంగా సెల్టిక్ ప్రజలు చేసేవారు) ఆ తర్వాత సెల్టిక్ ప్రజలు ఆహారం తీసుకొని, అక్కడ రగిల్చిన నెగళ్ళు (చలిమంటలు) చుట్టూ తిరుగుతూ సాయంత్రం సూర్యుడు అస్తమించేదాకా నృత్యాలు చేస్తూ ఆనందించేవాళ్ళు. ఆ రోజుతో సూర్యుడి తేజం తగ్గిపోతుంది అన్నమాట. 31 అక్టోబర్ రాత్రి సెల్టిక్ ప్రజలు పిశాచాలు, దయ్యాల మాస్క్‌లు ధరించి ఒకర్ని, ఒకరు ఆట పట్టించుకునేవారు. క్రైస్తవులు అక్టోబర్ 31ని ఆత్మలదినంగా భావిస్తారు. ఆ రోజున గతంలో మరణించిన వారి ఆత్మలు భూమిపైకి వస్తాయని క్రైస్తవులు భావించి. ఆ ఆత్మల శాంతికోసం ప్రార్ధనలు చేస్తారు. అమెరికాలో హాల్‌విన్‌డే మాస్కుల్ని మంచి గుమ్మడి కాయల్ని తొలచి తయారు చేస్తారు.

# 22.తాంత్రికులు పూజించే ఉచ్ఛిష్ఠ గణపతి వివరాలు ఏమిటి?

గణపతిని హైందవులు విఘ్నాలను తొలగించేవాడిగా భావించి పూజించటం జరుగుతుంది. ఈయనకు విఘ్నేశ్వరుడు అన్నపేరుకూడా ఉన్నది. ప్రపంచవ్యాప్తంగా దాదాపు అన్ని మత సాంప్రదాయాల్లోకూడా గణపతిని పూజించటం జరుగుతోంది. హైందవ తాంత్రిక విధానాల్లో గణపతినికూడా పూజించటం జరుగుతున్నది. ఒకవ్యక్తిపై అభిచారకర్మ (చేతబడి) ప్రయోగించబడినపుడు ఆ వ్యక్తి శారీరకంగా క్షీణించిపోయి చివరకు మరణించటం జరుగుతుంది. ఎంత ఉన్నతస్థాయిలో ఉన్న వ్యక్తి అయినా క్షుద్రప్రయోగాలకు ఎదురు నిలవలేడు. ఇలా చేతబడి లేదా బాణామతి లేదా చిల్లంగి అనే వేరువేరు పేర్లతో పిలవబడుతున్న క్షుద్ర ప్రయోగాలకు గురిఅయిన వ్యక్తులను రక్షించటంకోసం తాంత్రికశాస్త్రం అనేక మార్గాలను వివరించింది. అలాంటి వాటిలో ప్రత్యంగిర, ఆంజనేయ, నారసింహ, గండభేరుండ అనే శక్తులు ముఖ్యమైనవిగా గుర్తిస్తారు. అయితే వీటి అన్నిటికీ మించి అత్యంతశక్తివంతమైన ఇంకొక శక్తి ఉన్నది. ఆ శక్తిపేరే "ఉచ్ఛిష్టగణపతి".

కొన్నిసార్లు నరదృష్టి సోకటంవల్లకూడా గృహంలో ఆందోళన, కుటుంబ సభ్యుల మధ్య తగాదాలు, ఇంట్లో ఏదో తెలియని అశాంతి ఏర్పడతాయి. అంతేకాకుండా సమాజంలో ఎంతో గౌరవ ప్రతిష్టలు ఉన్నవాళ్ళు ఏవో తెలియని కారణాలవల్ల ఆ గౌరవ ప్రతిష్టలను కోల్పోవటం జరుగుతుంది. ఇలాంటి క్లిష్టమైన పరిస్థితులలో ఉచ్ఛిష్టగణపతి అనే తాంత్రిక శక్తిని గృహంలో ఉంచుకుని పూజించి నట్లయితే ఎలాంటి క్షుద్ర పీడలైనా తొలగిపోయి మేలు జరుగుతుంది. అసలు ఉచ్ఛిష్టగణపతి అంటే ముందుగా తెలుసుకుందాం. శత్రువులను నాశనంచేయటానికి సిద్ధంగా నిలబడిఉన్న ఉగ్ర గణపతినే ఉచ్ఛిష్టగణపతి అని పిలుస్తారు. సాధారణంగా హైందవులు కూర్చునిఉన్న గణపతిని పూజిస్తూ ఉంటారు. కానీ తాంత్రిక గ్రంధాలలో చెప్పబడిన ఉచ్ఛిష్టగణపతి నిలుచుని ఉంటాడు. ఈ యంత్రానికి ప్రాణప్రతిష్టచేయటానికి ఒక సమర్ధుడైన గురువు గారినిఎన్నుకోవలసి ఉంటుంది. ఎందుకంటే ఉగ్రమైన ఈ ఉచ్ఛిష్ట గణపతి యంత్రానికి కొన్ని ప్రత్యేకమైన మంత్ర విధానాలలో ప్రాణప్రతిష్ట చేయవలసి ఉంటుంది. దాదాపు 7 రోజులపాటు ఈ యంత్రానికి పూజలుచేయటం జరుగుతుంది. ఆ తరువాత ఈ యంత్రం ఎవరికి మేలుచేయటానికి ఉపయోగపడిందో ఆవ్యక్తి గృహంలో ఈ యంత్రాన్ని ఉంచటం జరుగుతుంది. ఈ యంత్రం, గృహంలో ప్రవేశించిన తరువాత గృహస్తుకు గ్రహసంబంధమైన పీడలు, క్షుద్ర ప్రయోగాల వలన కలిగిన అన్ని

రకాల సమస్యలు తొలగిపోతాయి. ఆపై ఆ కుటుంబ అభివృద్ధికి ఆటంకాలనేవే ఉండవు. ఈ ఉచ్ఛిష్ట గణపతి యంత్రాన్ని ఇంట్లో ప్రతిష్ఠించిన తరువాత ఆ ఇంటి యజమానికానీ, యజమానురాలుకానీ ఈ యంత్రానికి రోజూ పూజ చేయవలసి ఉంటుంది. ఈ ఉచ్ఛిష్టగణపతి యంత్రాన్ని పూజించే విధానాన్ని గురించి ఇక్కడ క్లుప్తంగా వివరిస్తున్నాను పరిశీలించండి.

ఉదయం 6గం॥లు అయ్యేసరికల్లా స్నానం పూర్తిచేసుకుని, ఆ తరువాత పరిశుభ్రమైన దుస్తులను ధరించి, దేవుడి ఆరాధనచేసే గదిలోకి ప్రవేశించి తూర్పు దిక్కునుకానీ, ఉత్తరదిక్కునుగానీ చూస్తూ కూర్చోవాలి. అనగా పూజచేసుకునేవారు పశ్చిమంలోకానీ, దక్షిణంలోకానీ కూర్చోవాలి. ఆ తరువాత యంత్రమును ఒకప్లేటులో పెట్టుకుని మీ ముందు ఉంచుకోవాలి. (దేవుడి అలమర ప్రత్యేకంగా ఉన్నవారు యంత్రాన్ని అందులోనే పెట్టుకొని పూజచేసుకోవచ్చు.) ఉచ్ఛిష్టగణపతిని ఆరాధించే వారు ఆయన యంత్రము ముందు ఆవునేతితో మాత్రమే దీపారాధన చెయ్యాలి. అదే విధంగా గంధము (Sandal) లేదా మల్లెపూల వాసనవచ్చే సాంబ్రాణి పుల్లలను వెలిగించాలి. ఆపై ఆ యంత్రమును మీ గృహములో ప్రతిష్ఠించిన గురువుగారి ద్వారా పొందిన బీజ మంత్రమును పఠిస్తూ యంత్రముపై గులాబీపూల రెక్కలను కానీ, తెల్లటిపూలను కానీ వేస్తూ బీజ మంత్రమును పఠించాలి. ఇలా రోజుకు 108సార్లు మంత్రాన్ని పఠిస్తూ పూజచేయవలెను. 40రోజులవరకూ రోజూ యంత్రమును పూజించవలెను. యంత్రానికి పూజచేస్తున్నంత కాలమూ రోజూ బెల్లపు పొంగలిని నైవేద్యంగా పెట్టాలి.

## 23. అవధూతలు అంటే ఎవరు?

అవధూత అంటే నేను అనే అహాన్ని త్యజించినవాడు మరియు తన శరీరంపై ఏవిధమైన అనురాగమూ లేనివాడు అయిన యోగి అని అర్థం. పసిపిల్లలు వంటిపై బట్టలు లేకుండా నలుగురిలో ఏవిధంగా నిస్సంకోచంగా తిరుగగలరో అలాగే ఈ అవధూతలుకూడా రాగద్వేషాలకు అతీతంగా సమాజంలో నగ్నంగా సంచరించగలరు. అవధూత దశను చేరుకునే యోగి ఆపై పునర్జన్మ రహితమైన మోక్షాన్ని పొందగలడు. దత్తాత్రేయుడిని తొలి అవధూతగా యోగశాస్త్రాలు పేర్కొంటున్నాయి. అఘోరీ అని పేర్కొనబడే ఒక తాంత్రికవర్గం ఈ అవధూతల నుండే ఏర్పడుతుందని గుర్తించాలి. తొలి అవధూత అయిన దత్తాత్రేయుడు ఒక యువసన్యాసియొక్క ఆకలిని తీర్చటానికి తన శరీరంలోని మాంసాన్ని ఖండించి ఆ యువ సన్యాసికి ఇవ్వటం జరిగింది.

ఈ అవధూతలు అష్టసిద్ధులను పొంది ఉంటారు. అలాంటి అవధూతలలో షిర్డీ సాయిబాబా, యోగివేమన, గొలగమూడి వెంకయ్యస్వామి, శ్రీ పోతులూరి వీరబ్రహ్మేంద్రస్వామి ఉన్నారని తెలుస్తున్నది. ఈ అవధూతలలో నాలుగు రకాల వారు ఉంటారు. వారు ఎవరంటే



**వీర అవధూత**

**(1) బ్రహ్మ అవధూత :** ఈ రకానికి చెందిన అవధూతలు పుట్టుకనుండి తాము జన్మించిన సమాజముతో ఏవిధమైన బంధాన్ని కలిగి ఉండరు.

**(2) శైవ అవధూత :** వీరు చాలా చిన్న వయస్సులోనే సన్యాసాన్ని స్వీకరిస్తారు. వీరి జుట్టు జడలుకట్టి ఉంటుంది. వీరు ఎల్లప్పుడూ సమాధి స్థితిలో ఉంటారు.

**(3) వీర అవధూత :** ఈ రకానికి చెందిన సాధువులు వంటిపై ఎర్రటి గంధాన్ని పూసుకుని ఉంటారు. వీరు కాషాయరంగు దుస్తులను ధరిస్తారు. వీరి మెడలో ఒక రుద్రాక్ష మాలకానీ, ఎముకలదండకానీ ఉంటుంది. వీరి జుట్టు విపరీతంగా పెరిగిపోయి గాలికి ఎగురుతూఉంటుంది. వీరియొక్క ఒక చేతిలో ఎల్లప్పుడూ ఒక దండం ఉంటుంది. వీరియొక్క ఇంకొకచేతిలో గొడ్డలికానీ, ఢమరుకంకానీ ఉంటుంది.

**(4) కులావధూత :** ఈ రకమైన అవధూతలు కౌల సాంప్రదాయానికి చెంది ఉంటారు. వీరు ఏవిధమైన ప్రత్యేక దుస్తులనుకానీ, అలంకరణనుకానీ ధరించని కారణంగా సామాన్య మానవులలో కలిసిపోయి ఉండే వీరిని గుర్తించటం సాధ్యంకాదు. వీరియొక్క ప్రత్యేకత ఏమిటంటే సామాన్యులతోకలిసి సామాన్య జీవితాన్ని గడుపుతూ ఉంటారు. వీరు కొన్నిసార్లు ప్రభువుల రూపంలోకానీ, కుటుంబీకుని రూపంలోకానీ ప్రజలకు కనిపించటం జరుగుతుంది. ఈ అవధూతలకు ఎన్నో మానవాతీత శక్తులు ఉంటాయని ప్రజలు భావించటం జరుగుతుంది.

